# శ్రీఅరవిందుల విశ్వదర్శనం

## Sri Aurobindo's
## WORLD-VISION

కె. ఆర్. శ్రీనివాస అయ్యంగారు






శ్రీ అరవింద సొసైటి :: తెనాలి



తత్వవిచారణలో అప్పటికీ యిప్పటికీ భారతీయులను అధిగమించిన
వారు లేరని ఋజువుచేసిన మహోన్నత వ్యక్తి, మహర్షులలో
అగ్రగామి శ్రీ అరవిందులు

— రోమారోలా

# శ్రీ అరవిందుల విశ్వదర్శనం

## Sri Aurobindo's World - Vision

మూలం : శ్రీ కె. ఆర్. శ్రీనివాస అయ్యంగారు

అనువాదం : శ్రీ ఎ. వెంకటేశ్వరరెడ్డి



శ్రీ అరవింద సొసైటి :: తెనాలి

ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి, 1981

ప్రతులు : 1000

వెల : రు. 4-00



ప్రకాశకులు : శ్రీ అరవింద సొసైటి, తెనాలి.



ప్రాప్తిస్థానములు . 1) శ్రీ అరవింద సొసైటీ, తెనాలి-522201

2) శబ్ద మరియు తెలుగుశాఖ, శ్రీ అరవిందాశ్రమం,
పాండిచేరి 605002

3) ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హ్యూమన్ స్టడీ,
యూనివర్శిటీ రోడ్ – హైదరాబాద్ 500768

ముద్రణ : బాబా ఆర్ట్ ప్రింటర్స్, సాలిపేట – తెనాలి.



రచయితను పుష్పమాలాలంకృతుని చేసిన అనువాదకుడు

# మా మాట

నవయుగ వైతాళికుడు, మహాపురుషుడు ఐన శ్రీ అరవిందుల 'విశ్వదర్శనం'లో 'భారత దర్శనం', 'భావి దర్శనం' మనకు దర్శన మిస్తాయి.

ఐదేండ్ల పసితనం నుంచి యిరువది యొక్కండ్ల వరకు పదునారేండ్లు - ఇచ్చట ఇంగ్లీషు కాన్వెంటులో రెండేళ్ళు, తదుపరి ఇంగ్లాండులో పదునాలుగేండ్లు - ఇంగ్లీషు విద్య, తిండి, బట్ట, నీరు, గాలి, మాట, పాట, ఆట, ఉనికి అంతా ఇంగ్లీషేగాని భారతీయ వాసనేలేని శ్రీఅరవిందులపై మనస్తత్త్వశాస్త్ర సూత్రం ప్రకారం ఆ లేత మనస్సుపై చెరగని ముద్ర పడియుండవలసింది. కాని భౌతిక పరిసర ప్రభావము లను, మనోశాస్త్రమునకు అతీతంగా పనిచేసెడి బలవత్తర శక్తి మరియొక టేదో యున్నదని ఋజువైంది భారతీయుని యాకృతిలో ఆంగ్లేయుని ప్రతిరూపముగా మారవలసిన శ్రీ అరవిందుడు దానికి విరుద్ధంగా పదహారణాల భారతీయుడు గనే తిరిగి వచ్చాడు

భారతావనిని అందరి వలె భౌగోళిక మట్టిముద్ద వలె గాక 'మాతగా' దర్శించాడు భవానీమందిర్ కరపత్రంతో వేలాది యువకుల హృదయాలు వేలాది భవానీమందిరాలుగా మార్చివేసిన వాక్పటిమ ఆయన వందే మాతరం పత్రికద్వారా నిద్రాణమై యున్న జాతిని జాగృతం చేసి స్వాతంత్ర్య పోరాటానికి యోధులమగా మలచిన వారి వాక్పటిమ అమోఘం, దేశభక్తి అద్వితీయం.

హిందూ - ముస్లిం ఐక్యతను సాధించుటకు, - ప్రేమ ప్రేమను జనింప చేస్తుందని, బలం బలవంతుని శాంత పరుస్తుం దని గుర్తుంచుకొని - ఒకరి నొకరు అపార్థం చేసికోవడం ముందు మానాలని, పరస్పర అవగాహన, అనుకంప అవసరమని, భారతీయు లందరు ఏ మతంవారైన భారతమాత బిడ్డలుగా సోదరు లని మూలప్రాతి పదిక చెప్పిన జాతినిర్మాత శ్రీఅరవిందుడు అంతేగాక ఆత్మగతమైన స్వేచ్ఛ మన కున్నప్పుడు మిగతా స్వేచ్ఛలన్నీ మన అదుపులో ఆజ్ఞలలో ఉంటా యనెడి మూల

సూత్రాన్ని చాటిన ధీమంతుడు. భారతీయుల భ్రాతృత్వ పునాదిపై సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని నిలిపి, మానవాళికోసం, భారత నిర్మాణం కావాలని, దేశప్రేమ, మానవప్రేమ, దైవప్రేమ మన జీవిత లక్ష్యాలు కావాలనీ ప్రబోధం జేసిన విశ్వవిశాల హృదయుడు శ్రీ అరవిందులు.

భారత భవితవ్యం మానవజాతి అదృష్టంతో ముడివేయ బడిందని, మానవునికి, ప్రపంచానికి సంబంధించిన భవితవ్యం అందులో చోటు చేసికొన్నాయని, మానవ ప్రకృతి యిలాగే సగం వెలుగు, సగం చీకటిలో కొనసాగదని,దివ్యచేతనా వికాసానికి మార్గాన్ని తెరిచే సత్యావతరణం పృథ్వీ పరిణామ గమ్యమని దర్శించిన భావిద్రష్ట శ్రీ అరవిందులు.

శ్రీ అరవిందుల భావిదర్శనం పాక్షికాలైన ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక, ధార్మిక, దేశీయ, జాతీయ దృక్పథాలను దాటి సత్యయుగ లేక అతిమానస అవతరణము దర్శించింది

పృథ్వీ పరిణామం సంకటస్థితియందున్న నేటి అసంపూర్ణ మానవునితో ఆగదని, ఒక నూతన మానవుడు ఒక నూతన ప్రపంచం ఒక నూతన స్వర్గం యెక్కడో కాదు ఇక్కడే, ఈ పృథ్వీ పైనే స్థాపింపబడతా యని శ్రీ అరవిందులు దర్శించారు.

అనంతత్వానికి, అమృతత్వానికి, ఆధ్యాత్మిక సంతాన మవడానికి 'నిరహంకారులు' కండి అని పిలుపు నిచ్చిన దార్శనికు డాయన

ఈవిషయ మంతయు లోతుగా పరికించి వివరణాత్మకంగా 'శ్రీఅరవిందుల విశ్వదర్శనం' లో మనకు అందించిన, జ్ఞానధనుడు, ప్రొఫెసరు, బహుగ్రంథకర్త, శ్రీ అరవిందులు శ్రీమాతపై ఉద్గ్రంథములు రచించి ప్రథమ బహుమతి పొందిన డాక్టరు కె ఆర్.శ్రీనివాసఅయ్యంగారికి మా నమస్సులు తన ఇంగ్లీషుగ్రంథమునకీ తెనుగనువాదము ప్రచురింపుటకు మాకు ప్రేమతో అనుమతి నొసంగిన ఆ విజ్ఞానమూర్తికి మా నమోవాకములు. వారి జీవిత విశేషములు 'రచయిత గురించి' అను ప్రత్యేక సంగ్రహ పరిచయములో గాంచ నగును.

అనువాదకుని మాట, మా మాటలో నిట పలుకరించుట సముచితము. వీరి నామం అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి, గ్రామం తూములూరు, జననం 1933 ఉద్యోగం లెక్చరర్. చదివింది యం. ఎ. ఫిలాసఫి. రచించింది 'సిగ్మండ్-ఫ్రాయిడ్ జీవితం-సిద్ధాంతం', కలలహరివిల్లు' (స్వప్నమనోవిజ్ఞానం), 'తాత్త్వికదృక్పథంలో సంస్కృతి - నాగరికత'-గ్రంథాలు. అనువదించింది ప్రభుత్వ బహుమతి పొందిన 'అందరికీ అవశ్యకమైన భౌతిక విజ్ఞానం', మెప్పును పొందిన ఈ 'శ్రీఅరవిందుల విశ్వదర్శనం'.

మా కోరికను మన్నించి చక్కని అనువాద మందించిన మిత్రులు శ్రీ వెంకటేశ్వరరెడ్డిగారికి మా కృతజ్ఞాభివందనములు.

ఈపొత్తమును ఓర్పుతో చక్కగా ముద్రించి యిచ్చిన బాబా ఆర్ట్ ప్రింటర్సు వారు అభినందనీయులు

శ్రీ మాతారవిందులకు ప్రణామములతో

శ్రీ అరవింద సొసైటి,

తెనాలి.

# రచయిత గురించి

డాక్టర్ అయ్యంగార్ 17 ఏప్రిల్, 1908 తమిళనాడు రామనాథపురం జిల్లా సత్తూరులో జన్మించారు మద్రాసు విశ్వవిద్యాలయానికి అనుబంధాలైన తిరునల్వేలి హిందూ కళాశాలలో, పలమూ త్తయ్య సెయింట్ జేవియర్ కళాశాలలో విద్యాభ్యాసం చేశారు. మద్రాసు విశ్వవిద్యాలయం నుంచి డి లిట్ పట్టాన్ని 1039 లో తీసు కొన్నారు

తరవాత అనేక చోట్ల అనేక కళాశాలల్లో అధ్యాపకులుగా పని చేశారు 1928 నుంచి 1931 వరకు సింహళంలోను, 1933 నుంచి 1044 వరకు బెల్గాంలోని లింగరాజ్ కళాశాల, 1944 నుంచి 1947 వరకు బగల్‌కోటలో వైస్ ప్రిన్సిపాల్‌గా, 1947 నుంచి 1906 వరకు వాల్తేరు ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో ఆంగ్లశాఖాధ్యక్షులుగ పని చేశారు

1959 లో లీడ్స్ విశ్వవిద్యాలయానికి ఇండో - ఆంగ్లికన్ సాహిత్యంలో విజిటింగ్ ప్రొఫెసర్‌గా వెళ్ళారు 1908 నుంచి ఆంధ్ర విశ్వవిద్యాలయాని గౌరవాచార్యులుగా ఉంటున్నారు

వీరు ఆంగ్ల సాహిత్యంలో అనేక పరిశోధన ప్రాజెక్టులకు నాయకత్వం వహించారు. స్వయంగా ఆంగ్ల, అమెరికన్ సాహిత్యాలలో, ఇండో-ఆంగ్ల సాహిత్య సంబంధాలలో, ఇండో-ఆంగ్లికన్-కామన్‌వెల్త్ సాహిత్యంలో, భారతదేశ ఆధ్యాత్మిక వారసత్వం పైన, తులనాత్మక సౌందర్య శాస్త్రంలో ఎన్నో పరిశోధనలు గావించారు

వీరు అధ్యాపకులుగానే గాక, అనేక పదవుల నలంకరించారు 1908 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్ చాన్స్‌లర్‌గా ఉన్నారు. 1999 నుంచి ఢిల్లీ శ్రీ అరవిందాశ్రమ శాఖకు అధిష్ఠాతగా ఉంటున్నారు. 1999 నుంచి 77 వరకు కేంద్ర సాహిత్య అకాడమీ ఉపాధ్యక్షులు. 1977 నుంచి World conference of Religions for Peace కు సంబధించి మద్రాసు విభాగానికి చైర్‌మన్.

వీరికి 1938 నుంచి గూడ PEN (Poets, Essayists, Novelists) అసోషియేషన్‌తో సన్నిహిత సంబంధం ఉంది 1957 లో టోకియోలో జరిపిన యునెస్కో పెన్ కాన్ఫరెన్స్‌లో పాల్గొన్నారు.

వీరు ఎన్నో గ్రంథాలను రచించారు లిటన్‌స్ట్రాచి, గెరార్డ్ మాన్లె హాప్‌కిన్స్, షేక్స్‌పియర్, ఫ్రాంకాయిస్ మోరిస్, రవీంద్రనాథ్ టాగోర్, స్వామి వివేకానంద, శ్రీ అరవిందుల జీవితచరిత్రలను, రచనలను, విమర్శనాత్మక దృక్పథంతో పరిశీలించి గ్రంథాలుగ వెలువరించారు 'On The Mother' అను గ్రంథం సెంట్రల్ ఏకాడమీ ప్రథమ బహుమతి యిటీవలనే గెల్చుకొంది.

'అడ్వెంచర్ ఆఫ్ క్రిటిసిజమ్' అనే వీరి వ్యాస సంకలనం మంచి మెప్పుకోలును బడసింది దానిని "ప్రాక్పశ్చిమ జలాల సమాగమంగా" అభివర్ణించారు. అలెన్‌టాటె అనే అమెరికన్ కవి-విమర్శకుడు అయ్యంగారిని,

"మానవీయ విమర్శకులలో మిగిలి ఉన్న చివరివారు." అని అభివర్ణించారు. ఇంకా ఆయన ఇలా అన్నారు :

> "మానవతా విలువలతో నిశిత సాహిత్య అంతర్దృష్టి అంత అందంగా, సమానంగా మేళనం పొందిన మరొక వ్యక్తి నాకు గానరాడు"

# ముందుమాట

1972 వ సంవత్సరానికి, ఈ రెండు "శ్రీ అరవింద స్మారకోపన్యాసాలను" నేను 1972 సెప్టెంబరు 21, 22 తేదీల సాయంకాలాలలో బొంబాయి విశ్వవిద్యాలయ స్నాతకోత్సవ మందిరంలో ఇచ్చాను. ఉపన్యాసాలివ్వ వలసిందని ఆహ్వానించినందులకే కాక, మొదటి రోజు అధ్యక్షత వహించినందుకు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులకు నా ధన్యవాదాలు. శ్రీ అరవిందుల రచనల నుంచి కొన్ని భాగాలను ఉటంకించడానికి అనుమతించిన పుదుచ్చేరి శ్రీ అరవిందాశ్రమ కాపీరైట్ విభాగానికి నా కృతజ్ఞతలు. ఈ గ్రంథాన్ని శ్రద్ధాసక్తులతో తీర్చి దిద్దిన బొంబాయి విశ్వవిద్యాలయ ముద్రణ శాఖకు, నా రెండు ఉపన్యాసాలకు హాజరై, ప్రతిస్పందించిన గుణజ్ఞులైన సదస్యులకు కృతజ్ఞతలు.

'మాతృభవన్'
మైలాపూర్, మద్రాసు
15 సెప్టెంబరు, 1976

కె. ఆర్. శ్రీనివాస అయ్యంగారు

# విషయ సూచిక



# శ్రీ అరవిందుల భారతదర్శనం

ఈ బొంబాయి విశ్వవిద్యాలయంలో ఏర్పాటైన శ్రీ అరవింద ఉపన్యాసపీఠం క్రింద మొదటి ఉపన్యాసకునిగ నన్ను ఈ విశ్వవిద్యాలయ సిండికేట్, ఉపాధ్యక్షులు ఆహ్వానించడం నాకెంతో ముదావహంగా ఉంది. దీనిని వారు నాకు చేసిన గౌరవంగా భావిస్తున్నాను. ఇక్కడ ఈ ఉపన్యాసపీఠం ఏర్పాటుచేయడం, శ్రీ అరవింద శతజయంతిసంవత్సరంలో నేను ఉపన్యాసాలివ్వవలసిరావడం, నాకు అలౌకికానందాన్నే చేకూరుస్తున్నాయి. బొంబాయిలోను, లోగడ బొంబాయిరాష్ట్రమని పిలవబడేదానితోను శ్రీ అరవిందులకున్న సంబంధం చరితార్థమైంది. కొన్ని కొన్ని సందర్భాలలో అది ఎంతో అర్థయుక్తమైందిగూడ. ఆయన జీవితఉత్తరార్ధానికి పాండిచేరి "తపోస్థలి" కానున్నట్లే ప్రథమార్ధానికి బొంబాయి-బరోడా విప్లవ - రాజకీయ రంగస్థలి అయింది, అలాగే ఆయన యోగాని కది కేంద్రమైంది.

నాకు ఇలా ఉపన్యాసాలిచ్చే అవకాశం రావడంగూడ ఎంతో సముచితంగా కుదిరిందని అనుకొంటున్నాను. ఎందుకంటె, 1942లో, మీ విశ్వవిద్యాలయానికి అప్పట్లో అనుబంధంగా ఉన్న బెల్గాంలోని లింగరాజ్ కళాశాలలో నేను పనిచేస్తున్నప్పుడు, మొదటిసారిగ శ్రీ అరవిందులవైపు ఆకర్షితుడనయ్యాను. పదకొండు సంవత్సరాలు బెల్గాంలో, మూడు సంవత్సరాలు బగల్కోటలో ఉపాధ్యాయునిగ పని చేయడంతో, ఆ రోజుల్లో–1933 నుంచి 1047 వరకు, షికర్పూర్ లోని ఎగువ సింధ్ నుంచి కర్ణాటక లోని ధార్వాడవరకు బహువ్యాప్తమైన బొంబాయి విశ్వవిద్యాలయానికి ఒకభాగాన్ని అయ్యాను. నా క్రియాశీలకజీవితంలోని ఉత్తరార్థాన్ని ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో

గడిపినప్పటికీ నాటిమిత్రులతో స్నేహం కసుగందలేదు. అనంతరం గూడ అది అలాగే అవిచ్ఛిన్నంగా కొనసాగింది. లోగడ ఉపాధ్యాయులలో ఇద్దరు — కీ. శే. సర్ బొమాంజీవాడియా, ఆచార్య టి. యమ్. అద్వానీలు — చాల ఏళ్ళుగ నన్ను సదవగాహనతో మన్నించారు. మీ లోగడ రిజిష్ట్రారు, రెక్టారు అయిన శ్రీ యస్. ఆర్. దొంగేర్‌కెరి నాయెడ ఎంతగానో శ్రద్ధావాత్సల్యాలను ప్రదర్శించారు. బొంబాయితోటి నా యీ గతసంబంధాలను నెమరువేసుకొంటూ, తిరిగి మీ మహావిద్యాలయానికి రావడం, అందులోను నా శక్తిని పరీక్షకు పెట్టే ఉపన్యాసాలివ్వవలసిరావడం, నాకు ప్రత్యేకంగా హర్షదాయకం.

ఈ ఉపన్యాసాలిచ్చే పని 'పరీక్షకు పెట్టేది' అని ఎందుకు అంటున్నానంటే, ఆధునికయుగపురుషులలో నిస్సందేహంగా శ్రీ అరవిందులు ఒకరు. దేశభక్తుడుగా, కవిగా పారమార్థిక జీవిగా, మేధావిగా, ప్రవక్తగా, యోగిగా వివిధరంగాలలో ఆయన సలిపిన కృషి మనకు సంభ్రమాశ్చర్యాలను కలిగిస్తోంది. అయినా ఆయన అసలు జీవితాన్ని మనం ఆయన అంతరంగంలోనే దర్శించాలి. అలాంటప్పుడు ఆ "అసలు జీవితా"న్ని గురించి మనకు తెలిసినదేమిటి? దానినిగురించి మనం ఏమి తెలుసుకోగలం? ఒకసారి ఆయన, తన అంతేవాసి అయిన దిలీప్‌కుమార్‌రాయ్‌కి, నిర్ద్వంద్వంగా ఇలా వ్రాశాడు.

"నీకుగాని, మరెవరికిగాని నా జీవితాన్నిగురించి ఏమీ తెలియదు. అది జనం చూడడానికి పైకి కనిపించేది కాదు."

విషయాలకు, తేదీలకు, సంఘటనలకు ఏమీ కొదువలేదు. కావాలంటే వీటి నన్నింటిని మనం సింహావలోకనం చేయవచ్చు. శ్రీ అరవిందులు కలకత్తాలో 1872 ఆగష్టు 15 న జన్మించాడు. తండ్రి కృష్ణధన్‌ఘోష్. ప్రభుత్వ ఆసుపత్రిలో ప్రఖ్యాతి గాంచిన శస్త్ర వైద్యుడు. మాతామహుడు రాజనారాయణబోస్. కొందరాయనను భారతజాతీయవాదానికి పితామహుడన్నారు. ఆధునిక భారతీయ పునరుజ్జీవనానికి ఉదయతార అయిన రాజా రామ్మోహనరాయ్ నుంచి ఆయన జాతి విముక్తికీ, మత సామాజిక సంస్కరణలకు ప్రోత్సాహాన్ని పుంజుకొన్నాడు. రామమోహనుని తరవాత ఒక శతాబ్దానికి శ్రీ అరవిందుని జననం నిజంగానే ప్రత్యూషాగమన మైంది.

డార్జిలింగ్‌లోని లారెటో కాన్వెంట్ స్కూలులో ప్రాథమికవిద్య పూర్తిఅయిన తరవాత, అరవిందుడు ఏడేళ్ళ నిండక ముందే, అన్నలైన మన్‌మోహన్, వినయ భూషణ్‌లతోపాటు ఆయనను ఇంగ్లాండ్ పంపించారు. అక్కడ మొదట మాంచెస్టర్‌లోను, ఆ తరవాత సెయింట్‌పాల్ స్కూలులోను, కేంబ్రిడ్జ్ కళాశాలలోను ఆంగ్లాభ్యాసం పూర్తియై జరిగింది. ఆయన తేలికగానే సంప్రదాయాంగ్ల సాహిత్యాన్ని ఆపోశనపట్టి తెలివైన విద్యార్థిగా పేరు తెచ్చుకొన్నాడు ఇండియన్ సివిల్‌సర్వీస్, ట్రైపాస్ పరీక్షను మంచి మార్కులతో ఇచ్చాడు. ఆయన గుర్రం స్వారీ పరీక్షకు హాజరు కాకపోవడంతో ఐ. సి. యస్. కు అనర్హునిగా నిర్ణయించారు. బరోడారాష్ట్ర ప్రభుత్వోద్యోగంతో సంతృప్తి చెందాడు. అనేక హోదాలలో పనిచేసిన అనంతరం, బరోడా కళాశాల వైస్ ప్రిన్సిపాల్ పదవికి, ఆంగ్లభాషాచార్య పదవికి పెరిగాడు.

శ్రీ అరవిందుల ఆశయాలమీద, అభిప్రాయాలమీద భారతీయ ప్రభావం ప్రసరించకుండ పదునాలుగేండ్ల ఇంగ్లాండ్ జీవితం ఒకకవచంగా పనిచేసి ఉండవచ్చు; భారత జాతీయతకు విముఖునిగా చేసి ఉండవచ్చు; సమకాలీన పాశ్చాత్యునికి మచ్చుతునకగా ఆయనను మలచి ఉండవచ్చు. ఆయన వేషాన్ని ఆంగ్లదొర పగటి వేషంగా, ఆయన వాణిని ఆంగ్లవాణికి ప్రతిధ్వనిగా దిద్ది ఉండవచ్చు; సంకోచం పొందిన ఆయన ఆత్మను లౌకికజీవయాత్రకు పణంపెట్టిన కేవల వినిమయ వస్తువుగ పరివర్తించి ఉండవచ్చు, కాని శ్రీ అరవిందుల జీవితం మీద ఆ కవచప్రభావం అంతంతమాత్రంగానే పనిచేసింది. అందుకని ఆయనలో అంతగ మార్పు రాలేదు. ఎందుకంటె ఆయన అంతరంగంలో సహజ జ్వాల స్థిరంగా మండుతూనే ఉంది. నిజమైన ఆ భారతమాతపుత్రుడు జననికి యేమాత్రం దూరం కాలేదు. అంతేకాకుండ ఇంగ్లాండ్ దీర్ఘవాసంలోకంటెకూడ ఆయనమేధ ఫ్రాన్స్‌లో సంతృప్తమైంది. ఆయన భావనా వీధిని "సిసిలీలోని ఆలివ్ వనవాటికలు", ఏథెన్స్ పురవీధులు ఆకర్షించాయి. చివరకు తిరిగి స్వదేశానికి వెళ్ళబోయే సమయానికి ఆయన ఎంతగానో సంతుష్టాంతరంగు డయ్యాడు. వాస్తవానికి ఎంతో గొప్ప గొప్ప ఆశంసలతో తరంగితు డయ్యాడు. ఈ విషయం, మనకు, ఈ క్రింది పంక్తులనుచూస్తే తెలుస్తుంది :

చేసుకొన్నాడు. తత్కాల కాంగ్రెస్ నాయకత్వాన్ని దులిపివేస్తూ, యువ ఆదర్శ గంథకార్తలను నిరసిస్తూ, బొంబై "ఇందుప్రకాశ్‌లో" సాహసోపేతమైన "పాత లాంతర్లకు కొత్త లాంతర్లు" శీర్షికతో వ్యాసపరంపరను వ్రాయనారంభించాడు. తను అందివ్వవలసిన మహాదర్శమేదో ఉందని ఆయన తలపోశాడు. జాతి నిర్మాణ, వినాశాలకు సంబంధించి అధునాతన నూతన పరిష్కారాలను తాను సూచించగలనని ఆయన గుర్తించాడు. ఆ ప్రకారమే, తన ఆలోచనలను వెల్లడించడానికి, కేంబ్రిడ్జ్ స్నేహితుడు, ఆ పత్రికకు ఆంగ్ల సంపాదకుడు అయిన కేశవరావు దేశపాండే ఇచ్చిన అవకాశాన్ని ఆయన వదులుకోలేదు. "అంధునికి అంధుడు దారి చూపుతూ ఉంటే, ఇద్దరూ కలిసి గోతిలో పడరా?" అనే మొదటి వ్యాసంలోని మొదటి వాక్యం "పర్జన్య గర్జనకారి" అయింది. పాఠకులు నిర్ఘాంతపోయి చెవులు రిక్కించారు. మర్మగర్భవ్యంగ్యంతో, అత్యంత గంభీరత ప్రతిధ్వనిస్తున్న పరిభాషణంతో వ్యాసాలు రా మొదలయ్యాయి. మొదటి రెండు వ్యాసాలలో కాంగ్రెస్ చేసిన విశ్వప్రయత్నాలు "ఓటమిలో ఎలా బ్రహ్మాండంగా ఏకీభవించడానికి" దోహదంచేశాయో వివరిస్తూ, మూడవ వ్యాసంలో, పరిస్థితుల సారాంశాన్ని ఇలా క్రోడీకరించాడు :

"అలాంటప్పుడు కాంగ్రెస్‌నుగురించి చెప్పేది ఇది —

> దానిలక్ష్యాలు సరైనవికావు. వాటిసాధనకోసం ఏ భావనతో ముందుకు గమిస్తున్నదో దానిలో నిజాయితీలేదు. ఆపని నిండు హృదయంతో చేయుటంలేదు. అది ఎన్నుకొన్న విధానం సరైనది కాదు. ఎవరిని నమ్ముకొన్నదో వారు సరైన నేతలూ కారు. క్లుప్తంగాచెప్పాలంటే— మనలను అంధత్వం నడుపుతోంది: అంధత్వం కాకపోతే ఏకాక్షులు నడుపుతున్నారు."

ఇది వ్రాసింది ఇరవైఒక్క సంవత్సరాలు నిండని యువకుడు. వ్రాసింది మనమోహన్‌ఘోష్, ఫిరోజ్‌మెహతా, మహాదేవగోవిందరనడే లాంటి మహా మహుల గురించి. బ్రిటీషువారికి విజ్ఞప్తులు పంపుకొనే తత్వానికి వ్యతిరేకంగా శ్రీ అరవిందులు స్వావలంబన విధానాన్ని, జనంలో అకళంక ఐక్యతను సమర్థించాడు.

" మన నిజమైనశత్రువు మనవెలుపల ఉన్న యేశక్తీ కాదు. కాని ఘోషిస్తున్న మన దుర్బలత, మన భీరుత, మన స్వార్థపరత, మన కాపట్యం, మన ఈషదంధ అభిప్రాయాలే (Purblind sentimentalism) మననిజమైన శత్రువులు. మనవిజ్ఞాపన, ఆమాటకొస్తే ఆత్మగౌరవం, ఉన్నతాదర్శాలున్న యేజాతి విజ్ఞాపన అయినా, ఆంగ్లో ఇండియన్ల అభిప్రాయంకోసం కాక, ఆంగ్లేయుల ధర్మవిచక్షణకోసం కాక, పునరుత్థానమవుతున్న మన మహాజాతి కోసం, కోటి మూక వ్యధిత భారతీయులపై మనకున్న నిర్వ్యాజసహానుభూతి (మనం దానిని నిర్వ్యాజం అనగలిగినంతవరకు) కోసం కావాలి "

ఈ వ్యాసాలక్రింద, సంతకం లేకపోయినప్పటికీ, బాలగంగాధర తిలక్ నిరాటంకంగా తన సమ్మతిని తెలియజేశాడు. కాని మితవాద నాయకుడైన మహాదేవ గోవిందరనడేను అవి బహు చీకాకుపెట్టాయి. దీనిని అర్థంచేసుకోవడం కష్టం కాదు. ఆ తరవాత అచిరకాలంలోనే శ్రీ అరవిందులు తనఅభ్యర్థనపై రనడేను బొంబాయిలో కలుసుకొన్నాడు. అయితే దీనివల్ల ఏ ఒక్కరిలోను మార్పు లేశమైన రాలేదు.

ఏది యేమైన దేశంమాత్రం తా నూహించినట్లు మగటిమను చూపించడానికి గాని, సాహసం చేయడానికిగాని సమాయత్తం కాలేదని శ్రీ అరవిందుల కవగత మైంది. అందువల్ల ఆయన తన పూర్వాశ్రమానికి వెళ్ళాడు. సాండిటీసముపార్జనం, పాఠాలు చెప్పడం, కవితలల్లడం, సంస్కృతం, బెంగాలీ, మరాఠీ, గుజరాతీభాషాధ్యయనాలపై దృష్టిసారించాడు. రామాయణ, మహాభారతాదుల అమృతజలధులను ఆస్వాదించాడు. ఆయన జ్ఞానవల్లరి ప్రాచీన అమృతమయ పురాణాలకు అల్లుకొంది. జాతి విక్రాంతిస్మృతులతో ఆయన పునరుజ్జీవితుడైనట్లు భావించాడు. కలల నెన్నిటినో కన సాహసించాడు. ఉత్తేజకర దృశ్యాలు త్రుటికాలం మెదిలాయి. బెంగాలీ భజన గీతాలలో గ్రుంకులిడినాడు. బంకించంద్రుని కాల్పనిక కవితాసృష్టిలో విహరించాడు. మహారాష్ట్ర పునరుజ్జీవనం, శివాజీల గురించిన ఆలోచనా స్మృతులతో ఉద్వేగితు డయ్యాడు. ఆయన అస్తిత్వాంతరాళాలలో యేదో ఒక త్రిగుణోన్మాదం, ఒక ప్రేమ తియం, ఒక త్రిముఖ కార్యక్రమం అనగా ఒక తీవ్రావేశం, ఒక మోహం, అదే

వస్తువుకు మూడు ముఖాలనదగిన ఒక కిర్మ అవ్యక్తంగా నిర్దుష్టాకృతిని పొందింది. పైకి మాత్రం ఆయన బరోడా కళాశాలలో మంచి పేరుమోసిన ఆచార్యుడే. 1901 లో వివాహానంతరం భార్య మృణాళిని, సోదరి సరోజినులతో నివసించాడు. రాత్రిళ్ళు పొద్దు పోయేవరకు చదివేవాడు, ఆయన పాఠాలు చెప్పాడు; వ్రాశాడు, ఉపన్యసించాడు; ఆయన ఇంగ్లీషు దొరబాబులాగ కాక భారతీయునివలె వస్త్రధారణం చేశాడు. నవ్వగల, నవ్వించగల శక్తి ఆయన కున్నాయి. కావాలంటే, తన అంతరంగంలోకి ఆయన ఉపసంహరించుకోగలడు. మరి ఆ రోపలి మనిషిని, అసలు అరవిందుని దర్శించే మార్గం ఏమిటి ? ఆయనను ఒక్కసారి కలిస్తే చాలు, అది యాదృచ్ఛికమైనా సరే, ఆయన కళ్ళల్లోని అపూర్వకాంతితో ప్రభావితులు కావలసిందే. సి. ఆర్. రెడ్డి బరోడా కళాశాలలో చేరినప్పుడు, ఆ కళాశాల ప్రిన్సిపాల్ ఎ. బి. క్లార్కు, శ్రీ అరవిందునిగూర్చి, రెడ్డితో ఇలా అన్నాడు :

> "అయితే అరవిందఘోష్‌ను మీరు కలిశారన్నమాట. ఆయన కళ్ళను మీరు గమనించారా ? వాటిలో ఏదో ఒక మార్మికజ్వాల, తేజోపుంజం ఉంది. అది ఈ భూమి ఆవలితీరాలను చీల్చుకు పోగలుగుతుంది. జోన్ ఆఫ్ ఆర్కుకు దివ్యవాణి వినిపిస్తే, బహుశా, అరవిందులకు దివ్యదర్శనం అయింది."

శ్రీ అరవిందులు ప్రేమికవా ? (అప్పటికే ఆయన "ఊర్వశి", "ప్రేమ-మృత్యువు" లను రచించాడు) అంతేకాక ఆయన మహాద్రష్టకూడానా ? బహుశా అటువంటివారిని గుర్తించేనేమో షేక్స్‌పియర్ థీసస్ (Theseus) చెప్పింది :

> " ఉన్మాది, ప్రేమికుడు, కవి — వీరి
> భావనలన్నీ సుసంహతాలే (Compact)
> కవి కన్ను, సుందరావేశంతో పరిభ్రమిస్తున్నప్పుడు,
> దివినుంచి భువికి, భువినుంచి దివికి వీక్షిస్తుంది,
> భావావేశం రూపురేఖలు దిద్దుకొనేకొలది
> కవి కలం అజ్ఞాతవస్తురూపాలకు
> ఆకృతులను కల్పిస్తుంది, కాల్పనిక శూన్యానికి (airy nothing)
> నామరూపాలను ఇస్తుంది, "

ఇహాన్ని దాటి చూడగలగడం, దివినుంచి భువికి, భువినుంచి దివికి రశించడం, అదృశ్య వస్తువులకు రూపకల్పన చేయడం వాటికి నామకరణం చేయడం, పతత్రి పదాల (Winged words) తో వాటిని అపరం చేయడం – ఇవన్నీ కాల్పనిక దర్శకుని చైతన్యశక్తిని చాటి చెబుతాయి. శ్రీ అరవిందులు అటువంటి ఒక ద్రష్ట.

బాహ్య కవచాన్ని ఛేదించుకొని అంతర్గత సత్యాన్ని చేరినప్పుడు ఆయనకు ఏమి కనిపించింది? భారతదేశం జననిగా సాక్షాత్కారమైంది. భారతీయులు ఆమె బిడ్డలుగ గోచరించారు. మరిపోగొట్టే వివిధ బాహ్యాంశాల వెనుక అగాధ ఆధ్యాత్మిక ఏకత్వం కనిపించింది. అదే దర్శనంలో ఒక నేతాజునిగూడ చూచాడు; కార్యాచరణకు, ఆత్మార్పణకు, అభిమంత్రణానికి ఒక పిలుపునూ విన్నాడు. ఇలా ఆయన దర్శించిన విషయాలు కేవలం ఇలా చూచి అలా మరచిపోయేవి కావు. అవి కర్మాచరణకు అనుల్లంఘనీయ ఆదేశాలు గూడ.

కాని 'దర్శనం' (Vision) అనేది మామూలు 'వీక్షణం' కంటె లేదా "ఫోటో స్నాప్" కంటె ఎలా భిన్నమైంది? ఇంతకాలం మనం అనేక వస్తువులను చూస్తూనేఉన్నాం, కాని "దర్శించడం" లేదు. దేశకాలాలు, స్థితిగతులు, వ్యక్తిస్వభావం "వీక్షణానికి" పరిమితులు విధిస్తాయి. "వీక్షణం" ఎప్పుడూ "స్థిరం" "త్రిమాత్రం", "సమతలం" లేదా "ఘనం" గాఉంటుంది. ఒకడు రంగుటద్దాలనుంచి చూస్తాడు, (అందరు చేసేది ఇది), లేదా వృత్తాకార, కుంభాకార దర్పణాల్లోనుంచి చూస్తాడు. విలియమ్ ఆర్చర్, కాథరిన్ మేయో, బెవర్లీ నికోల్స్, నిరాద్ చౌధురి, ఆర్థర్ కొజ్లర్, వి. యస్. నైపాల్, వేద్ మెహతా — ఎందరో, ఎందరెందరో ఇండియాను తమ తమ రంగుటద్దాల నుంచి (వ్యక్తిగత దృష్టినుంచి) చూశారు. కాని, మరి "దర్శనం" అంటె అలా కాదు; "దర్శనం"లో భూత భవిష్యద్వర్తమానాల పరిగ్రహణం ఉంటుంది. ఆధిభౌతిక, ప్రాణిక, మానసిక, ఆధ్యాత్మిక స్థాయిలన్నిటిలోని అనుభవాలను సమైక్యం చేస్తుంది. దానికి తనదైన స్వీయ అంతర్గతశక్తి ఉంది; కార్యకారణ, గతి, పరివర్తన పరిణామ సూత్రాలున్నాయి. 'ఈథర్' క్షేత్రాధారంతో ప్రచలించే తరంగ కణాలవలె దర్శనంలో గూడ స్థిర, ప్రగమన, అధిభౌతిక మూలకాలన్నీ భవ భావాల ఆవిష్కారాద్భుతంలో సంగమిస్తాయి. అంతిమంగా చెప్పాలంటే "దర్శనం" దైవప్రసాదం. అది క్రొంగ్రొత్త వెలుగులు వెదజల్లుతుంది. నిర్దిష్ట కార్యాచరణకు అది ఒక అనుజ్ఞ.

చివరిగా లభించిన ఈ దర్శనాన్ని అందుకోవడానికి కావలసిన అనుభవశకలాలు ఆయనలో చిన్ననాటనుండే ఉన్నాయి. డార్జిలింగ్‌లో, పసివాడుగ ఉన్నప్పుడే, ఆయనను ఒక అంధకార ఆచ్ఛాదనం లేదా తమస్సు పరివేష్టించినట్లయింది. ఆ ఆచ్ఛాదనం ఆయనను ఎంతో కాలం తరవాతగాని వీడలేదు. ఇంగ్లాండ్‌లో ఉన్నప్పుడు మాతృమూర్తి భారతావనిపై ప్రేమాంకురాలు మోసులెత్తాయి. ఆ ప్రేమాంకురాలకు భౌతిక వాస్తవికతను ఇచ్చింది, ఆ అంకురాల నుంచి అవ్యవహితంగా జాలు వారిన సుఖ సంతోషాలను నిజం చేసింది, 1893 ఫిబ్రవరిలో సంభవించిన అపోలో బందర్ "ఐంద్ర జాలిక స్పర్శ." రోజులు, నెలలు, సంవత్సరాలు గడిచేకొలది, పరిసరాలతో స్పందించేకొలది, భారత చరిత్ర, సాహిత్యాలను తరిచే కొలది, ఆయన సమగ్రావలోకనం ప్రియ భారతావనిని ఆకళింపు చేసుకొనే కొలది, మాతృమూర్తి భారతావని "నామ — రూపాల"కు ఆయన ఊహలు, ఆకృతులను కల్పించే కొలది ఆయన ముందు ఆకస్మికంగా ఒక సమగ్ర దర్శనం — భారతదర్శనం — జాజ్వల్యమాన మైంది. దాని నుంచి దృష్టులను మరల్చలేకపోయాడు. ఎందుకంటె ఆయనకు ప్రత్యక్షమైంది ఉత్తేజకర, భయానక మహాదర్శనం. భారతం కేవల భౌగోళిక ప్రదేశం కాదని, దాని భౌతికాకృతి (యథాతథంగా ఇది చాల అద్భుతమైంది) వెనుక ఒక జీవం, ఒక మనస్సు, ఒక చైతన్యం, ఒక ఆత్మ దాగి ఉన్నాయని ఆయన మొదటి నుంచి ఊహించాడు. అందుకని "మాతృభారతి" రూపకాలంకారమూ కాదు, గాడంబర భాషాలంకారమూ కాదు, అదొక నగ్న సత్యం. అసందిగ్ధ సత్యానుభవము. బంకించంద్రుడు, ద్విజేంద్రలాల్ రాయ్‌లు భారత ప్రశస్తిని గానం చేసినప్పుడు, వారు కేవలం "కవి నిరంకుశత్వం" (Poetic licence) తో సంతృప్తిని పొంద లేదు. తద్భిన్నంగా, వారు దేనిని దర్శించారో, దేనిని వైభవోపేత మను కొన్నారో, దేనికి వారు వినీతులయ్యారో (Surrender) దానినే వర్ణించారు :

జననీ, నాదు ప్రణామా లివే।

నీవు జ్ఞానానివి, ధర్మాని వీవు,

నీవు మా హృదివి; మృత్యువును

జయించే మా హృదయస్థ సంభ్రమానివి.

మళ్ళీ, (ఇది ద్విజేంద్రలాల్ రాయ్ రచననుంచి) :

విశ్వమాతవు, మానవాళికి తత్త్వ,
అర్థజ్ఞానాలను ప్రథమంగా అందించిన దాతవు
మనిషికిచ్చావు నీవు దివ్యప్రేమను, జ్ఞానాన్ని, కృతుఃను,
కళా ఖండాలను, వివృతి ధార్మిక ద్వారాన్ని ..

అటువంటి సంప్రదాయ జ్ఞానంతో మేము
తలెత్తుకొని భూమిని చుట్టివస్తాం;
హే జననీ, ఆ వైభవోపేత గతాన్ని వహించువారు
సాహసవంతులు అభిమానధనులు అవుతారు.

భారతావనీ, నా భారతావనీ ! ఈ రోజు
నీ స్థితి దయనీయమని ఎవడనగలడు ?
జ్ఞానానికి, ఆరాధనకు, సృష్టికి జననివి,
ఆత్మ అంతర్గత దీప్తిని సాకిన తల్లివి.

శ్రీ అరవిందులు గూడ, తన సతీమణి మృణాళినికి, 1905 లో, తన కప్పటికి ఆవిష్కారమైన సత్యాన్ని గురించి వ్రాశారు :

"మిగతావారు దేశాన్ని జడ పదార్థమని, మైదానాలని, పొలాలని, అడవులని, పర్వతాలని, నదులని భావిస్తుండగా, నేను నా దేశాన్ని తల్లిగా తలుస్తున్నాను ."

సరి భారతావని జననే అయితే, భారతీయులు — ముప్పైకోట్లమంది — అంతమంది సోదర సోదరీమణులు, అసంఖ్యాక జనం ఆకలితో అలమటించడంలేదా ! అనంత క్లేశాలతో వేగిపోవడంలేదా ! శ్రీ అరవిందుడు భారతావనిని జననిగా దర్శించేటప్పుడే ఆశోకవిషయాన్ని గూడ చూశాడు. ఆ విషయం భీతావహమైంది, అవమానకరమైంది.

అంతే కాక కుత కుత ఉడికించే ఒక భీభత్సాన్ని, కార్యాచరణకు లంఘించమని ఆదిలించే ఒక చురకను దర్శించాడు. దీనిని గురించి ఆయన భార్యకు వ్రాసిన ఉత్తరంలో ఇలా ఉంది.

> దానవు డొకడు తల్లి రొమ్ముపై కూర్చొని రక్తం త్రావ సన్నద్ధ డవుతుంటే తనయుడేమిచేస్తాడు ? తింటూ కూర్చొని, పెళ్ళాం బిడ్డలతో కాలక్షేపం చేస్తూ తృప్తి పడతాడా ? లేక తల్లి రక్షణకు ఉరకలు తీస్తాడా ?

భీరుత్వం, ముందు చూపు బేరీజు కట్టడం, వర్తమాన అసంతృప్తిని గమనించ లేకపోవడం, అపజయ మనివార్య మనే భావానికి తలొగ్గడం — లాంటి శక్తులు బిడ్డలను మాతృ రక్షణకు పూనుకోకుండ అడ్డు పడ్డాయి. ఇదే సమయంలో వ్రాసిన "బహిరంగ లేఖ" చిత్తు ప్రతిలో, ఆమె సంతానమని చెప్పుకోవడానికి తగని ఆ బిడ్డలను గురించి శ్రీ అరవిందు లిట్లన్నాడు :

> " భారతమాత బిడ్డలం కాదని చెప్పుకొనే కొడుకులకు,
> నిరీహులు స్వార్థులు అయిన సంతానానికి, స్వసుఖ ర
> క్షణేచ్ఛాపరులకు, నిరాశ మృత్యుప్రియ తండ్రులకు... "

> "సోదరులారా ! మీరు, నా తల్లికి తెలివి తక్కువ మిత్రులైనా, స్వార్థపర శత్రువులైనా ఇంకా తల్లికి బిడ్డలే. ప్రజా హృదయంలో భీరుత బలహీనతలను రేకెత్తించే సామాన్య వాణి మీ అందరిలోను ఉంది.. మీరు మాతృ హంతకులుగా తయారయ్యారంటే అది మీ అజ్ఞానం వల్లనే నని నేను మనఃపూర్వకంగా విశ్వసిస్తున్నాను. అందుకని రండి, మనమంతా కలిసి ఆలోచిద్దాము."

కోట్ల ప్రగత నిదురపుచ్చే విమోహ గీతాలను హౌతరు చేయకుండ, శ్రీ అరవిందులు తన భార్యకు వ్రాసిన లేఖలో మహోదాత్తంగా :

"ఈ పతిత జాతిని ఉద్ధరించేశక్తి నాకున్నదని నాకు తెలుసు. ఆ శక్తి క్షాత్రతేజం కాదు. నేను ఏ కృపాణంతోనో, తుపాకితోనో పోరాడ బోవడం లేదు. బ్రహ్మతేజం (జ్ఞానబలం) తో పోరాడతాను ఇది నాలో మెదిలే నూతనభావం కాదు. నాలో ఇటీవలనే మొలకెత్తినదీ కాదు; ఇది నాకు జన్మతః ప్రాప్తించింది. ఇది 'నా మూలగ' (ఎముకలసారం = Marrow) లో ఉంది."

ఆయన పరమ, పరమ, పరమ ఉన్మాదికారా ? ముప్పై కోట్లమంది భారతీయులను తన స్వంత సోదరులుగ దర్శించినవాడు పిచ్చివాడు కాక మరేమిటి। తల్లి రక్తాన్ని పీల్చ సన్నద్ధమవుతున్న రక్కసుని దర్శించినవాడు మంచివాడా ? అన్నిటిని మించి అసంభవమైన కార్యాన్ని తలకెత్తుకొన్నవాడు, తాను రాక్షసుని తరిమికొట్టి, తల్లికీ, బిడ్డలకు ముక్తిదానం చేస్తానని మహా దీక్ష పూనినవాడు పిచ్చివాడు కాడా ?

ఇంకో విషయింగూడ ఉంది : దేవుడే కనుక – దేవుడుకాక మరెవరు ? – ఈ మహాకార్య నిర్వహణకు శ్రీ అరవిందుని పంపినట్లయితే, ఆయన ఆ దేవుని చేరే మార్గం, సాక్షాత్కారం చేసుకొనే ఉపాయం కనుక్కోవాలి; దేశ విమోచన కార్యంలో ఆ దేవుని సహకారాన్ని ఆవాహనం చేయగల విధాన్ని కనుక్కోవాలి. ఆ కారణాన ఆయనను ప్రేమత్రయం – దైవప్రేమ, ప్రజాప్రేమ, దేశప్రేమ – అనే తీవ్ర రాగ భావావేశం అనుశాసించింది. ఆయన జీవనగతిని నిర్దేశించింది. గతశతాబ్ది చివరనుంచి, బెంగాల్‌లో, రహస్యంగా, విప్లవ కార్యకలాపాలను ప్రారంభించాడు. పశ్చిమభారతంలో, ఇతరత్ర నాయకులతో, సంఘాలతో సంబంధాలు పెట్టుకున్నాడు. బెంగాల్‌కు చెందిన సోదరి నివేదిత, మహారాష్ట్రకు చెందిన తిలక్‌లు ఆయనతో చేయి కలిపారు. అంతే కాక 1902 లో అహమ్మదాబాద్ కాంగ్రెస్ సమావేశానికి హాజరైనప్పుడు, తిలక్ పని చేస్తున్న తీరును గమనించి, ఆయనతో పరస్పరాభిప్రాయాలను వెలిబుచ్చుకొన్న తరవాత, దేశవిముక్తికి కాంగ్రెస్‌ను ఒక మంచి ఆయుధంగా తీర్చి దిద్దగల ఒక విప్లవాత్మక పార్టీకి నాయకుడు కాగల లక్షణాలు తిలక్‌కు ఉన్నాయని ఆయన విశ్వసించాడు. సహోదరి ఏదీ లేనప్పుడు, ఆనుషంగిక సాయుధ విప్లవానికి రహస్య సన్నాహాల అవసరాన్ని విస్మరించకుండానే, జాతీయ పార్టీని తిలక్ గారి శక్తివంత

పైన నాయకత్వం క్రింద నడిపించవలసి ఉంటుందని భావిస్తానే, యోగం ద్వారా సాధనాలకు పదును పెట్టి క్రమశిక్షణలో ఉంచడం తనకు సాధ్యమవుతుందని, అమోఘమైన నవ్యశక్తిని పొందవచ్చునని, విమోచనోద్యమాన్ని నిర్నిరోధంగా అశించిన లక్ష్యానికి తీసుకు వెళ్ళవచ్చునని శ్రీ అరవిందులు విశ్వసించాడు.

రాజకీయాలు, యోగం : ఇది ఒక అపూర్వ సమ్మేళనం. కాని శ్రీ అరవిందులకు రాజకీయం అంటే జాత్మాత్మ సాక్షాత్కారము. వ్యక్తిగత ముక్తికోసం గాక, జాత్యాత్మ సాక్షాత్కారాన్ని విస్తరింప జేయడం, సాధించడం కోసం యోగాన్ని అనుసరించాలి. ప్రాణాయామం లాంటి యోగాలు బ్రహ్మాండమైన సృజనాత్మకశక్తి సముపార్జనకు దారితీశాయని గ్రహించాడు శ్రీ అరవిందులు. కాని ఆయనకు ఇంతకంటె గణనీయ ఫలితాలు కావాలి. ఏది ఎలాఉన్నా, ఆయనకు మాత్రం ఒక విషయం స్పష్టమైంది : భారతదేశం విషయంలో మాత్రం జాతీయరంగ నుంచే దైవరంగమే. కాని దివ్యసంగ్రామాన్ని సమారంభం కావించేముందు, మాతృమూర్తిని మిధ్యామైకం నుంచి మేల్కొలపాలి; ప్రజలను శతాబ్దాల పగత నిద్రనుంచి జాగరితులను చెయ్యాలి; నూతన కార్యక్రమాన్ని ప్రకటించాలి; ఒక నూతన మంత్రాన్ని జనానికి ఉపదేశించాలి. పూర్వ బెంగాల్‌రాష్ట్రాన్ని చీల్చాలని లార్డ్ కర్జన్ తీర్మానించిన సమయం కార్యాచరణకు పిలుపు నివ్వవలసిన క్షణమని, ఈ క్షణం పూర్వ నిర్దేశితమని శ్రీ అరవిందులకు అనిపించింది. అంటే కాకుండ విమోచన సంగ్రామాన్ని — అది దివ్యసంగ్రామం కావడంవల్ల — లక్ష్యానికి తగ్గట్లు పుటం పెట్టి నిగ్గుతేల్చిన పరికరాలతో సాగించవలసి ఉంది. అసుర శక్తితో పోరాటం సలపడానికి దివ్యశక్తి కంటె అల్పమైన దేదీ పనికిరాదు. అందుకని ఈ దివ్యశక్తిని — ప్రాక్తన శక్తిని — భవానిగ ఆవాహనం చెయ్యాలి. జాతీయ కార్యానికి ఆమె మద్దతును సంపాదించాలి.

దీనికిగాను ఆయన 'భవానీ మందిర్' అనే కరపత్రాన్ని రచించవలసి వచ్చింది. కొండలమధ్య భవాని మాతకు ఆలయ ప్రతిష్ఠాపనం చేయాలనే సంకల్పం భౌతికంగా సఫలం కాకపోయినా, ఆ సమయంలో అత్యంత ఉద్రిక్తంగా ఉన్న రాజకీయ పరిస్థితికి ఆ కరపత్రం ప్రేలుడు మందుగా పని చేసింది. ఏ గుడిని నిర్మించని మాట నిజమే, నిర్మించడం సాధ్యం కానిమాట నిజమే. అయినా మందిరం లేని లోటు లేశమాత్రం గూడ కన్పించలేదు. ఆ కరపత్రాన్ని రహస్యంగా పంచినప్పుడు

దానిని చదివిన మాత్రాననే అనేకమంది దేశభక్తులు, యువకులు స్వయంగా భవానీ మందిరాలుగ రూపుదాల్చారు. ఆకాంక్ష, యత్నం, బలాలతో గూడిన శక్తినిలయం భవానీ మందిర్. అది సాహసావేశ కార్య సాధనల యంత్రం.

జాతి — (మాతృదేశం) — అనేది భారతదేశమని పిలవబడే ఒక "శక్తి", ముప్పైకోట్ల ప్రజాశక్తి సజీవ ఐక్యత" అని ఆ కరపత్రం మొట్టమొదట చెబుతుంది. కాని చారిత్రక పరిస్థితులు, "విశ్లథ స్వార్థకాముకత" అనే జడరాజ్యాల ఐంద్రజాలిక తమోవలయంలో, ఆమెను బందీని చేశాయి. తమస్సు అంటే భీతి, శంక, జంకు, మాంద్యం, ఆలోచనారహిత స్వార్థపరత్వం. శక్తిని అంటే అంతర్గత దివ్యత్వాన్ని ఆవాహనం చేసుకోవడం ద్వారా తమస్సును ఛేదించాలి. పొందగింప చేసిన స్వార్థపరత్వంలో, ఓటమిని ఆహ్వానించే మన జడత్వంలో, దాని సతతపు మందభాగ్యాన్ని (కీడును) మనం అనుమతించిన కారణాన, "శక్తి"ని పరిత్యజించి, మన హృదయాల నుంచి, మెదడు నుంచి, బాహువుల నుంచి దానిని పారదోలిన కారణాన, ఆమెను న్యూనపరచి మనలను న్యూన పరచుకొన్నాము. ఈ అత్యాచారాల వల్ల ఆమె మనకు దూరమైంది. కనుక అవమానం, వినాశనం మనలను పైకొన్నాయి. ఒక నూతన "ఆత్మజ్ఞానం", భక్తితో నిజాయితీతో ఆ మంత్రించడం ద్వారా సంభవమైన ఒక నూతన 'శక్తి ప్రక్షేపణం', దేశ, ప్రజా సేవకై నియుక్తమైన ఒక నూతన "కర్మయోగం" — ఈ మూడింటితో గూడిన ఒక సమగ్ర త్రిగుణోద్యమం మాత్రమే జరిగిన కాలనష్టాన్ని పూరించగలదు. సర్వ ప్రపంచానికి కావలసిన భావిధర్మాన్ని, — సర్వ మతాలను, విజ్ఞాన శాస్త్రాలను, దర్శనాలను సమమేళనం గావించి మానవాళి సంతతిని ఏకాత్మగా మార్చగల సనాతన ధర్మాన్ని — ఆమె అందించాలంటే, భారతదేశం పునఃజన్మించాలంటే అటువంటి త్రిగుణోద్యమం మాత్రమే సహాయపడగలదు. కాని ముందరి పని ముందే జరగాలి. అవనత భారతావని లేచి నిలబడి తనంత తాను బలం పుంజుకోవాలి. "అటువంటప్పుడు, ముందుకు నడు, తల్లి పిలుపు ఆలకించు," అనే వాక్యాలతో ఆరంభమైంది ఈ సుప్రసిద్ధరచన ముగింపు భాగం :

"ఆమె ఇప్పటికే మన హృదయాలలో, ఆత్మాభివ్యక్తీకరణంకోసం,
ఎదురుతెన్నులు చూస్తున్నది: మన పూజలందుకోవడానికి నిరీక్షిస్తున్నది.

మనలోని దేవుణ్ణి చీకటి ఆవరించడాన ఆమె ఉదాసీన అయింది. ఉదాసీనత ఆమెను బాధించింది. బిడ్డలు ఆమె సహాయాన్ని లక్ష్యించక పోవడంతో ఆమె శోకతప్త అయింది. మీలో ఎవరైతే మీ అంతరాంతరాలలో ఆమె కదలికలను గుర్తిస్తారో, వాళ్ళంతా ఆత్మను కప్పిన నల్ల ముసుగును విదిల్చి వేయండి; బంధించే అలసత్వపు గోడలను బద్ధలు కొట్టండి; మీ దేహాలతో, తెలివితేటలతో. మాటలతో లేదా ధనంతో, ప్రార్థనతో, పూజలతో ప్రతి ఒక్కరు యథా శక్తిని మీకు తోచిన రీతిలో ఆమెకు అండగా నిలవండి. వెనుకంజ వేయవద్దు. ఎందుకంటె ఆమె పిలుపు విని గూడ లక్ష్యపెట్టని వారికి ఆమె 'ఆగమన దినాన' కోప మూర్తిగా కనిపించవచ్చు. కాని ఆమె అవతరణానికి ఏ కొంచెం దోహదం చేసినా వారికి ఆ తల్లి ముఖం కరుణ సౌందర్యాలతో ఎంత దీప్తిమంతంగా ఉంటుందో!"

భవానీ మందిర్ కరపత్రం చూచినప్పుడు ప్రభుత్వం గడగడ లాడింది. దానిని సరిగా అర్థంచేసుకోలేక పోయింది. కాని అర్థంచేసుకొన్నంతలో, అది మనుషుల గుండెలల్లో బడబాగ్ని రేపుతుందనీ, మట్టి నుంచి మహావీరులను పుట్టిస్తుందని గ్రహించింది. కాని అందులో ఉన్న పారమార్థిక సూక్ష్మాలను గ్రహించలేక పోయింది. ఆ కరపత్రాన్ని, మహోపద్రవకరమైన, హింసాయుతమైన విన్యాసంగా, ప్రాణాంతక విప్లవాత్మక ప్రేలుడు మందుగా ప్రభుత్వం పరిగణించింది। చాల సంవత్సరాల తరవాత, రౌలట్ నివేదికలో, దీనిని, భారతదేశ విప్లవ కార్యకలాపాల వెనుక ఉన్న ముఖ్య ప్రేరకంగా ఉదహరించవలసి వచ్చింది.

ఏది ఎలా జరగాలో అలాగే జరిగింది. ఆధ్యాత్మిక విప్లవకారుల శిక్షణ కేంద్రంగా ఆ కొండల మధ్య రూపొందవలసిన దేవాలయం స్థానంలో వేలాది యువకులు వేలాది భవానీ మందిరా లయ్యారు. వారంతా ఆ సమయంలోనే శ్రీ అరవిందులు రచించిన "దుర్గా స్తోత్రా"న్ని చూచారు. 'భారత శక్తి' సామర్థ్యం మొత్తాన్ని ఆవాహనం చేసి, ఆ శక్తితో వారి నందరిని నింపి, ఆవేశింపజేసి, వారి

నందరిని, జాతిని జాగరూకంచేసే బ్రహ్మాండమైన పునరుత్థాన పరికరాలుగ పలచ జాలిన మహామంత్ర మది. పరిస్థితులు మారిన ఈనాడు గూడ, నళినీకాంత గుప్తని ఆంగ్లానువాదంలో గూడ, ఆ మంత్రం నిజంగా మనలో పొరలివచ్చే ఆధ్యాత్మికశక్తి ప్రవాహం. తమస్సును శక్తిగా, నిరానంద నిరాశను ప్రభాదీప్తంగా మార్చివేసే అణుశక్తి యంత్రమది. హిందువుల చెవులకు చిరపరిచితమైన దుర్గ, శివ, కాళీ నామాలు ఆ మంత్రంలో ఉచ్చరిత మవుతాయి. కాని అందులో నిజంగా ఆవాహనం చేసింది (తరవాత శ్రీ అరవిందులు ఒక సూటిప్రశ్నకు సమాధానంలో వివరించినట్లు) మూల "ఆద్యశక్తి"ని, ప్రపంచాలను సృజించిన సృష్టికర్త్రిని, అందరి వాసస్థానాన్ని, గర్భాశయాన్ని, ప్రాణులకు ప్రాణియైన మహాప్రాణిని, విశ్వం యొక్క జ్ఞాన, ఆత్మ, శక్తులను. ఆ అద్భుతమైన మంత్రంలో కొన్ని శ్లోకాలను చదువుతాను :

హే దుర్గా మాతా ! సింహారూఢనీ,

సర్వశక్తి ప్రదాయినీ ! మాతా ! శివప్రియే !

మేము నీ బలసంపన్న అంగాల నుంచి జనించాము. భారత యువకుల మైన మేము ఇక్కడ నీ గుడిలో కూర్చున్నాము. శృణు, హే మాతా, ఈ భువికి దిగిరా, ఈ భారతావనిలో అభివ్యక్తం కా...

హే దుర్గా మాతా ! ... జీవనసమరంలో, భారత సంగ్రామంలో మేము నీ సమాదేశిత సైనికులము; మాతా, మా మనస్సుకు హృదయానికి అతి మానుషశక్తిని, మా ఆత్మ ప్రజ్ఞలకు దివ్యశీలాన్ని, జ్ఞానాన్ని అందించు ..

హే దుర్గా మాతా ! భారతావని స్వార్థంతో, భీతితో, అల్పత్వంతో హేయంగా పడి ఉంది. మమ్ము మహాత్ములను చేయ, మా యత్నాలను మహనీయం చేయి, మా హృదయాలను విస్తృతం చేయి, మా నిర్ణయాలకు మమ్ము బద్ధకంకణులను చేయి, మేమిక, శక్తిశూన్యులమై, అలసశీలులమై, భీతచిత్తులమై ఇక ఏ మాత్రం అల్ప విషయాలను ఆశించకుందుముగాక ....

హే మాతా, దుర్గా! అంతఃశత్రువును దునుమాడు, అవల బాహ్యకంటకా లను తొలగించు. ఉదాత్త వీరోచిత మహా బలసంపన్న భారత జాతిని, ప్రేమైక్యతలలో, సత్య పరాక్రమాలలో, కళా పాండిత్యాలలో, శక్తి జ్ఞానాలలో పరమమైన భారత జాతిని, దాని పవిత్రారణ్యాలలో, దాని సుసంపన్న క్షేత్రాలలో, గగన చుంబిత పర్వతాలలో, దాని అమలఝరీ ప్రవాహతీరాలలో ఎప్పటికీ వసించనీ ...

'హే దుర్గా మాతా! నీ యోగ శక్తితో మా శరీరాలలో ప్రవేశించు, మేము నీ పరికరాల మవుతాము, పాపాన్ని పరిహరించే నీ కృపాణ మవుతాము, తమస్సును పారదోలే నీదీపిక అవుతాము ...

వీరమార్గ అవిష్కర్త్రీ! రా రమ్మ. నిన్నిక ఏ మాత్రం దూరం చేసుకోము. మా జీవితమంతా మాతకు నిరతోపాసన మగుగాక; మా కర్మలన్నీ పరిపూర్ణ ప్రేమకు, పరిపూర్ణ శక్తులకు ఆస్పదమైన మాతకు నిరత సేవలౌగాక. తల్లీ, ఇది మా ప్రార్థన, భూమిపై అవతరించు, ఈ భారత గడ్డపై నిన్ను నీవు అభివ్యక్తం గావించుకో!

'మందిరం', — ఎవరికి వారే ఒక మందిరం; 'మంత్రం' — ఆ మంత్ర మహాశక్తితో ఎవరికి వారే దేవతను ఆవాహనం చేసి ఆ మందిరంలో ప్రతిష్ఠించుకోవచ్చు: 'సమయం' — పరీక్షకు పెట్టే ఆ మహోగ్ర సమయం గూడ ఆసన్నమైంది. బెంగాల్ విభజన బెంగాలీలనే కాక భారతజాతినే నిర్వీర్యులను చేయడానికి ఉద్దేశితమైంది. కాని అది దైవలగ్నం (Hour of God) కూడ. ఆ క్షణం కాలాంతర్గతమైంది, కాలాతీతమైంది. ఆ సమయమే భారతదేశ చారిత్రక ప్రవాహగతి కొత్త మలుపు తీసుకోవలసిన సమయం. 'దైవలగ్నం' అనే వ్యాసంలో శ్రీ అరవిందులు వ్రాసినట్లు, దైవానుజ్ఞ పొందిన అటువంటి సమయాలలో నిర్వ్యాజమైన అల్పయత్నం గూడ మహా మహిమాన్వితంగా ఉంటుంది. ఈ రోజుల్లోనే శ్రీ అరవిందులు ఈ వ్యాసాన్ని వ్రాశారు. ఇది 'భవానీ మందిర్' కరపత్రం, దుర్గామంత్ర భావాలతో

శృతి గలిపి, తన వాణిని ఎలుగెత్తి చాటింది. కాని, దానికి ఆయన ఒక హెచ్చరికను మందలింపును జోడించాడు.

> "ఆ దివ్యముహూర్తమాసన్నమైన సమయంలో నిదురించే వ్యక్తి గాని, జాతి గాని మందభాగ్యులే. అలాగే ఆ ముహూర్తబలాన్ని ఉపయోగించుకోవడానికి సిద్ధం కాని వ్యక్తి గాని, జాతి గాని, దుఃఖభాజనులే. ఎందుకంటె, స్వాగతం పలకడానికి వారు మంగళతోరణాలు సిద్ధం చేసుకోలేకపోయారు, 'పిలుపు'ను వినడానికి వారి చెవులు మూతలు పడి ఉన్నాయి. కాని బలం ఉంది, సంసిద్ధులై ఉండి గూడ ఆ శక్తిని వృథాచేసి, లగ్నాన్ని దుర్వినియోగం చేసిన వారికి దుఃఖం మూడింతలవుతుంది. వారికి పూరింపరాని నష్టం, నాశం కలుగుతాయి."

వ్యాసం రెండవ సగాన్ని, సంకట సమరంలో, జాతి విమోచన సంగ్రామ కాలంలో, ఒక ప్రధాన సేనాని నిర్దేశించిన 'కార్యక్రమం'గా మనం అభివర్ణించనచ్చు :

> "దివ్య ముహూర్తంలో, ఆత్మవంచన, కాపట్యం, పనికిమాలిన ఆత్మస్తుతుల నుంచి ఆత్మను ప్రక్షాళనం చేసి, నీ ఆత్మను నీవు సూటిగ దర్శించి, అప్పుడు దానిని పిలుస్తున్నదెవరో నినెదవుగాక ! ఆదర్శ జ్యోతికి వ్యతిరేకంగా నీవు నిర్మించుకొన్న ఒకనాటి రక్షణ దుర్గమైన నీ స్వాభావిక కాపట్యమంతా నేడు బీటలువారి ఆఘాతానికి ఆహ్వానం పలుకుతున్నది... కాని శుచివై, భీతిని ఆవల ఉంచు; ఎందుకంటె ఆ ముహూర్తం మహోగ్రం, అది ఒక బడబాగ్ని, ఒకచక్రవాతం, ఒక పెను తుఫాను, ఒక దేవుని ఆగ్రహ ప్రేషణయంత్ర (Wine press) విన్యాసం. కాని దీనిలో లక్ష్యశుద్ధితో నిలబడగలిగిన వాడే ఎప్పటికీ నిలుస్తాడు. అటువంటివాడు పడిపోయినా మళ్ళీ లేస్తాడు. అతడు గాలి రెక్కల (Wings of the wind) పై పోతున్నట్లు కనిపించినా,

తిరిగి వస్తాడు. లౌకిక ప్రపంచ గుస గుసలను నీ చెవులకు గాఢంగా సోకనీకు; ఎందుకంటె ఆ ముహూర్తం ముందుగా ఊహించనిది."

బెంగాల్ (ప్రథమ) విభజన "సమయ"మే ఆ ఊహించని లగ్నమని ఋజువు చేయవలసి ఉంది. సంఘటనలు అలాగే ఋజువు చేసినవి. కర్జన్ గాలిని వాటిలే, మింటో చక్రవాతాన్ని కోసుకొవ్వాడు. ఎందుకంటె, కర్జన్ కలలు కన్నట్లు సంఘటనలు జరగలేదు మితవాదులు భావించినట్లు గాని, లక్షలాది నిరాయుధషండులు అనుకొన్నట్లు గాని జరగలేదు. అది నిజంగానే అనుకోని ముహూర్తం.

1905 అక్టోబరు 16 వ తేదీ బాయ్‌కాట్ ఉద్యమం ఒక ప్రక్క, బెంగాల్లోనే కాక దేశమంతట పెల్లుబికిన జాతీయ భావం వేరొక ప్రక్క, ఆత్మ గౌరవాన్ని ఇనుమడింప చేసుకొనే మహా ప్రయత్నం ఒక దరి, ఆశా విశ్వాసాల 'ఉభయం' యొక్క ఆకస్మికోదయం మరొక దరి, దిన దినం వేనకు వేలు వేదికల నుంచి మారుమ్రోగే 'వందేమాతరం' గీతాలాపనలు వేరొక దరి — వీటితో జాతీయ రాజకీయ వాతావరణం కొద్ది నెలలలోనే గుర్తించ వీలు లేనంతగా మారిపోయింది.

'దర్శనం' — కార్యోన్ముఖతకు దృఢమైన ఆదేశం — అది అనుకోనిదే అయినా హృదయంగమమైన ప్రతిస్పందనం: అదిఅంతా ఒక ఏకతానురూపం. శ్రీఅరవిందులు భారతమాతను ఇలా దర్శించారు : ఆమె నీరవస్థితిలో ఉంది. మృగ పిశాచి ఆమె రక్తం త్రావ ప్రయత్నిస్తోంది. కాని ఆమె బిడ్డలు దయనీయులై మిన్నకున్నారు; లేదా ముఖాలు మరెటో త్రిప్పుకొని ఉన్నారు. బిడ్డలు ఆమె శక్తిని ఆవాహనం చేయ గలిగితే చాలు, జాగరితమైన ఆ తల్లి బిడ్డలను తప్పక విముక్తులను చేస్తుంది, బిడ్డలు ఆక్రోశించకపోతే, తల్లి లేవదు. తల్లి లేచేవరకు పిల్లలు దీనులుగ, దండితులుగ మ్రగ్గవలసిందే, పరస్పర పాశ బంధితులైన తల్లి — బిడ్డల దురవస్థ చూచిన తరవాత శ్రీ అరవిందులు, దివ్యప్రేరితమైన ఒక క్షణంలో ఇలా ఆదేశించారు :

"భవానీ మందిరాలు నిర్మించండి; శక్తిని ఆవాహనం చేయండి అన్ని రంగాలలో శక్తిని సమీకరించండి ; అంతే కాదు: ప్రతి ఒక్కరు ఒకగుడి కావాలి. "మర్గాస్త్రోత్రా"న్ని దౌష్ట్యానికి విరవరోధంగా

తలలొగ్గిన తామస మానవులమ సాహసోపేతమైన సైనికులుగ, దానవాంతకులుగ పరివర్తించే రసవిద్యా సాధనం కానివ్వండి. ఆ సమయం వస్తుంది. ఎప్పుడో నిర్ణయమైన దైవముహూర్తం, దేనియల్ చేతిలో గోలైత్ పరాజయాన్ని చూడవలసిన ఆ ఘడియ, నిరాయుధమైన నిస్తేజమైన ఈ జాతి, సర్వ శక్తిమంతమైన విదేశీప్రభుత్వ పీచమణిచే ఆ ఘడియ తప్పక వస్తుంది!"

ఈ లోపల శ్రీ అరవిందుడు గూడ బహిరంగంగానే పోరాటంలోకి దూక సంసిద్ధుడయ్యాడు మొదటిగ, కలకత్తా పరిణామాలను ఆయన ఎప్పటికప్పుడు గమనిస్తున్నాడు. అడపదడప కొలదికాలం పాటు అక్కడకు వెళ్ళివస్తున్నాడు గూడ. చివరకు, 1906 మధ్యలో అక్కడ కొత్తగ స్థాపింపబడిన జాతీయ కళాశాలలో ఉపన్యాసకులుగ వెళ్ళాడు. అంతకు కొద్దికాలం ముందు, బిపిన్‌చంద్రపాల్ స్థాపించిన "వందేమాతరం" పత్రికకు 'వాస్తవ' సంపాదకత్వం వహించాడు. సంపాదకునిగ తనపేరు ఉంచడానికి ఆయన అనుమతించక పోయినప్పటికి, ఏకీకృతమైన దాని మనస్సు, ఆత్మ, హృదయం శ్రీ అరవిందుడే. ఇండియాలో, ఇంతకు మున్నెన్నడూ, పత్రికా వ్యాసంగంలో దాన్పటిప అంత ఎత్తుకు ఎదగలేదు. ఎవరు అంతటి ఆలోచనాపటిమను ప్రదర్శించలేదు. అటువంటి ద్వంద్వ తార్కిక ఇంద్రచాప కాంతుల సీనలేదు. అంతటి ఆత్మ వ్యగ్రతను నిశ్వసించలేదు. ఆ బెంగాల్ విభజన మందభాగ్య దినపాన వ్యక్తమైన ప్రజా ఐక్యతను సింహావలోకనం చేస్తూ జూలై 1907 లో శ్రీ అరవిందుడు :

"వేదికల మీద దంచే ఉపన్యాసాలలో పూర్తి అర్థం తెలియకుండానే, పదే పదే ఉపయోగించే దేశభక్తి — ఆ నినాదం — కట్టలు తెంచుకొని, పూజారి, రాకొమరుడు, పేద, రైతు అనే తేడాలేకుండా, జనహృదిలో ప్రవేశించింది .. క్టోబరు 16 ప్రదర్శన, హిందువులు, మహమ్మదీయులు, బౌద్ధ, జైన, శిక్కులు, పోలీసు, ప్రజ అంతా, ఏదో సహజ భ్రాతృభావ మాత్మికశక్తి నెట్టుకొచ్చినట్లు, కలిసిపోయిన ఆ ప్రదర్శన,

భావి తరానికి మనోహరమైన ప్రాక్దర్శన (Prevision) మైంది. అటువంటి ప్రాక్దర్శనం, ముక్తి ద్వారంవద్ద నిలబడ్డ మనిషికి, లేదా జాతికిమాత్రమే ప్రసాదింప బడుతుంది... అది క్షణికమే కావచ్చుకాక. కాని దాని దర్శించిన వారు ఎప్పటికి మరిచిపోరు, విశ్రమించరు."



ఒకసారి ఆ దర్శనం అయిన తరవాత, దాని ననుసరించి, వాతావరణం అనుకూలించినా, ఎదురు తిరిగినా, స్థిర చిత్తంతో, "ప్రలోభకుని మందహాసాలను కాతరు చేయకుండ, కారాగార ప్రవేశ నిష్క్రమణ ద్వారాల గుండ, మృత్యువు కోరలలోకి," కదం తొక్కుతూ ముందుకు పోదారు. ఇలా ముందుకు పోవడమనేది, మొదట ఆ దర్శనం ఎంత అందంగా కనిపించిందో, ఎంత వాస్తవంగా కనిపించిందో అదే విధంగా తిరిగి ప్రతిష్ఠింపబడే వరకు" కొనసాగుతుంది.



1907 జూలైలో వ్యాసం వ్రాసినప్పటికే – లేదా ప్రథమ విభజన దినమైన 1905 అక్టోబరు 16 నాటికే – జాగరితమైన భారతదర్శనం, సముద్ధత జాతి సంఘటిత 'శక్తి' దర్శనం, సామాన్య జన సందోహానికి అందించబడింది. అంతకు చాలకాలం ముందే అది, దైవకృపవల్ల శ్రీ అరవిందులకు ఆవిష్కృతమైంది. జాతి పునరుజ్జీవన కార్యక్రమావళిలోని ఇతర అంశాలను ఆయన గమనించ లేకపోలేదు. విద్య (శారీరక, ప్రాణిక, మానసిక, ఆధ్యాత్మిక కోణాల నుంచి), స్వదేశీ, ప్రజారోగ్యం, సాంఘిక సంక్షేమం, కర్మాగార వ్యవసాయ క్షేత్రాల సమన్వయం, సామాజిక సామరస్యం, మొదలైనవన్నీ ఆయన దృష్టిలో ఉన్నవే. ఎందుకంటె సమయం వచ్చినప్పుడెల్ల వీటిని దృష్టిలో పెట్టుకొని మాట్లాడేవాడు. కాని అలా ఉన్న ఆ పరిస్థితులలో, పోయిన ఆత్మగౌరవాన్ని పూరించడం, వైయక్తిక, సామూహిక 'శక్తి' పునరుద్ధానం, జననిలో ఏకమై ఆమెకు అర్పణం గావించుకోవాలనే ఆధ్యాత్మిక ఆదర్శాన్ని పునఃస్థాపించడం, దీనిని ధృవీకరించడం – ఇవన్నీ స్వరాజ్యాన్ని లేదా స్వాతంత్ర్యాన్ని పొందడానికి ఆవశ్యకా లనిపించాయి. ప్రపంచ రాజ్యాలకు గురుత్వం వహించవలసిన విధి నిర్దేశిత పాత్రకు అనుగుణంగా భారత జాతిని తీర్చి దిద్దడానికి అవి అవశ్యకాలని పించాయి.

జాగరిత మవుతున్న నవభారతంతో, సాహసంచేయడానికి, బాధలు భరించడానికి, అవసరమైతే జాతీయ పునరుజ్జీవన మహా యజ్ఞంలో తమంత తాము సమిధలు కావడానికి సమాయత్తమై ఉన్న యువ భారతంలో భావ ప్రసారం నెరవడానికి శ్రీ అరవిందుని కున్న ఒక సాధనం 'వందేమాతరం'. రోజు రోజు, వారం వారం, ఆ సందేశం వినిపింపబడుతూ ఉండే. కళాశాలల్లో, ఆఫీసుల్లో, ఫ్యాక్టరీల్లో, పరిశోధన శాలల్లో ఉన్న యువతరం దానిని గౌరవ పురస్సరంగా, ఏకాగ్రతతో స్వీకరించింది. జాతి, తన రక్తనాళాలలో, ఒక పులకింతను, ఒక ఆశా కెరటాన్ని, ఒక నవశక్తి వెల్లువను, ఒక ఆత్మోత్కర్షను — వీటి అన్నింటిని మించి భవితవ్యోన్మీలనానికి సంబంధించిన ఉత్సాహ భరితమైన 'నిశ్చయా' (Certitude) న్ని అనుభవించింది. ఆ ఉత్తేజిత, అభిమంత్రిత దినాలు శౌర్యయుగ రాగాకృతులను సంతరించు కొన్నవని చెప్పవచ్చు :

ఆ ప్రత్యూషంలో జీవించడమే ఆనందం,
కాని తరుణ వయస్సే సాక్షాత్స్వర్గం !

ఇంతకాలం గడిచిన తరవాత. అరవై ఐదు సంవత్సరాల నాటి 'వందేమాతరమ్', స్వర్ణయుగ ప్రత్యూషంలో, యువత హృదయంలో, శ్రీ అరవిందులు ఎంతటి ఉన్నత స్థానాన్ని ఆక్రమించారో ఊహించడం అసంభవం కాకపోయినా కష్టతరమైన పని. గత మగత నిద్రనుంచి లేచిన లేక లేస్తున్న భారతదేశాన్ని, విముక్త సమైక్య సముజ్జ్వల విక్రాంత భారతావనిని, ఊహించగల, దర్శించగల ఋషి — కవి, దేశభక్త — ప్రవక్త ఆయన. నమ్మ శక్యంకానంత అల్ప వ్యవధిలో, ఈ దర్శనాన్ని, ఈ ఆశారేఖను. ఈ పునరుజ్జీవన సంకేతాన్ని తన దేశీయులకు అందించ గలిగాడు. ఆ దర్శన అనుషంగిక యథార్థీకరణంలో ఆయన కున్న పరమ విశ్వాసాన్నే వారిలోను నాటగలిగాడు. ఈ నా మొదటి ఉపన్యాసాన్ని, శ్రీ అరవిందుల శక్తి శీలాల గురించి శ్రీ బ్రహ్మబంధోపాధ్యాయ ఇచ్చిన 'ఆప్తవాక్యం' తో ముగించడం సమంజసంగా ఉంటుంది. తరవాత కొద్ది కాలంలోనే, శ్రీ బ్రహ్మబంధోపాధ్యాయ కలకత్తా జైలు ఆసుపత్రిలో దేశభక్తి కారణంగా, అసువులు బాసాడు :

" శ్రీ అరవిందుడు జీరలేని శ్వేతపద్మం, భారత మానససరోవరంలో విరబూసిన శత పత్ర పద్మం ... "

"మన అరవిందుడు... అతనిలో విభ్రాజమాన హిమ ధవళ 'సాత్విక' దివ్యసౌందర్యం నెలకొన్నది. అతని ఆత్మ వైభవోపేతం; హృదయం విశాలం... పవిత్రుడు, పరిపూర్ణుడు–అత డనిలావిస్కందిత (fire-charged) పర్జన్య గర్జన అయినా పద్మ పత్రంలా లలిత కోమలుడు, సుకుమారుడు, జ్ఞానధని, ధ్యానమగ్నుడు. ముల్లోకాల్లో ఎక్కడ మీకు అటువంటి వాడు తటస్థపడడు. దేశాన్ని దాస్యశృంఖలా విముక్తం గావించడానికి పాశ్చాత్య నాగరికతా వ్యామోహాన్ని ఛేదించుకొని, ఇహ సౌఖ్యాన్ని త్యజించాడు. ఇప్పుడు తల్లికి తనయుడులా 'వందేమాతరం' బాధ్యతలను స్వీకరించాడు. అతడు బంకిం ఋషిచెప్పిన భావానందుడు, జీవానందుడు, ధీరానందుడు — ముగ్గురూ అతడే. "





# శ్రీ అరవిందుల భావి దర్శనం

నిన్న సాయంత్రం నేనుచేసిన ఉపన్యాసంలో శ్రీ అరవిందుల భారత దర్శనాన్ని గురించి మీకు ఒక అవగాహన నివ్వటానికి ప్రయత్నించాను. అది ఒక ఆత్మదర్శనం. అందులో ఆత్మ తన సాక్షాత్కారాన్ని తానే చూచుకోగలదు. ఆ దర్శన భాగ్యాన్ని, దానిని నిజం చేసుకొనే అమోఘ మర్మాన్ని శ్రీ అరవిందుడు సంపాదించడమో, లేదా అవి ఆయనకు అనుకోకుండా లభించడమో జరిగింది. ఇలా జరిగిన తరవాత శ్రీ అరవిందుడు, ప్రతి స్త్రీని, పురుషుని ఆకాంక్ష, వ్యగ్రత, నిష్పన్నత బలాల దేవాలయాలుగ మార్చివేయగల "భవానీ మందిర్" పథకాన్ని రూపొందించాడు. దేవిని ఆవాహనం చేసి అంతరంగంలోనే ప్రతిష్ఠించుకోవడానికి దుర్గా మంత్రాన్ని రచించాడు. అమోఘమైన దైవజ్ఞతతో "బెంగాల్ విభజన" ఘట్టాన్ని "దైవలగ్నం"గా మార్చివేశాడు. ఆ సమయంలో, జనంలో, చైతన్యం తాండవించింది. మన జీవన జలాలపై (Waters of our being) విస్తృతంగా దేవుని శ్వాస వీచింది అల్ప యత్నం గూడ బృహత్ఫలితాల నివ్వడమే కాక కార్యకలాపాల స్థితి గతులను శక్తిమంతం చేసింది. 1907 మధ్యకాలానికి జాగరిత భారతావని హృదయాంతరాళాలలో బాగా నాటుకుపోయాడు. ఈ జాగృతిలో అతని పాలు అల్పమేమీ కాదు. ఒక ప్రక్క కలకత్తా జాతీయ కళాశాలలో ఆచార్యత్వం, మరొక ప్రక్క బెంగాల్ లోని "అతితీవ్రవాద" పక్షం వెనుక నిలబడి దానికి కావలసిన మేధాసంపత్తి నివ్వడం, ఇంకొక ప్రక్క అంతకంటె సార్థకంగా, శివుని మూడవ నేత్రంలా, మహోగ్ర ప్రచండ "వందేమాతరా"న్ని ప్రబోధించడం — వీటి నన్నింటిని ఏక కాలమందే నిర్వహించాడు ఆనాటి నేషనలిస్ట్ పార్టీలో లోకమాన్య డంతటి వా డున్నాడు, మరి

లజపతిరాయ్, సర్దార్ అజిత్‌సింగ్, వి. ఒ. చిదంబరం పిళ్ళై, బిపిన్‌చంద్రపాల్, అశ్వనీకుమార్‌దత్తా లాంటి శిఖరాయమాన మహోన్నత వ్యక్తులున్నారు — అయినా శ్రీ అరవిందులు పురోవరి నుంచి, దాదాపు అదృశ్యంగానే, నాయకత్వం వహించాడు, ఆయన జాతి విమోచన, పునరావాసాల మహా యజ్ఞానికి రహస్యాగ్ని.

రోజులు గడిచే కొలది, "ప్రాసంగికంగా" (By the way) అనే శీర్షిక క్రింద "వందేమాతరం"లో వెలువడుతున్న సంపాదకీయ ప్రక్షేపణాస్త్రాలు జనాభిప్రాయాన్ని కూడగట్టుకు రా సాగాయి. విదేశీ నియంతృత్వానికి వ్యతిరేకంగా దేశంలో స్థిరాభిప్రాయాన్ని నెలకొల్పాయి. ప్రభుత్వానికి మద్దతునిచ్చే వారిని, ప్రభుత్వం నుంచి క్షమను యాచించే వారిని అవి తికిమక పెట్టాయి. ప్రభుత్వం అరుణిమ దాల్చింది, సెగలు పొగలు కక్కింది. కాని చర్య తీసుకోవడానికి అశక్త మయింది. ఎందుకంటె, పైకి కనిపించకుండ అంతర్లీన విప్లవ ధ్వనిని నిక్షిప్తంచేసి వ్రాసిన వ్యాసాలవి. వాటిని ఆయన చట్టం పిడికిళ్ళకు చిక్కనంతటి పైశాచిక చాతుర్యం (అది ప్రభుత్వం అన్నమాట) తో వ్రాశారు. జాతీయ వాదుల వెనుక నిలబడ్డ 'చాలన శక్తి' శ్రీ అరవిందులనడంలో సందేహం లేదు. ప్రసిద్ధ "భవానీ మందిర్" రచయితగా ఆయన విప్లవ వాదుల కుత్తేజం. అందుకని ప్రభుత్వం అతని మీద అభియోగం తేవాలనుకొంది. ఆ అభియోగం గూడ అతడేమైన స్వయంగా వ్రాశాడని కాదు, అతని సోదరుడు నరేంద్రకుమార్ ఘోష్ సంపాదకత్వం వహిస్తున్న బెంగాలీ "యుగంతర్" లో ప్రచురితమైన కొన్ని వ్యాసాల ఆంగ్లానువాదాలను "వందేమాతరం" లో ప్రకటించినందుకే ఆ అభియోగం జూలై 1907 లో ఆకస్మికంగా శ్రీ అరవిందుని జైలులో పెట్టి అభియోగం మోపడంతో ఆయన పేరు దేశవ్యాప్తంగా తెలిసింది. భారతదేశం నలుమూలలనుంచి అనేక ప్రశంసలు అందాయి. వాటిలో రవీంద్రనాథ్ ఠాగోర్ నుంచి వచ్చింది గణ్యమైంది, శాశ్వతమైంది. కారణం, ఆరోజుల్లో ఆయన పేరుమోసిన వాడవడమే కాకుండ శ్రీ అరవిందుల కంటె ఎంతో పెద్దవాడు. "హే అరవిందో, రవీంద్రుడు నీకు ప్రణమిల్లుచున్నాడు!" తో ఆయన పంపిన పద్య మారంభ మవుతుంది. ఈ గౌరవ పురస్సరమైన గుణగ్రహణ వ్యగ్రత పద్య మంతట ప్రదర్శిత మైంది —

హే మిత్రమా, నా దేశ హితుడా, హే స్వేచ్ఛాయుత,
మూర్తీభవించిన భారతీయాత్మ వాణీ! దేశ సేవక యశస్సు
నీ అదృష్టాన్ని అధివసించును,
అన్యాయార్జిత విత్తం, ప్రమత్త స్వాంతనాలు నీ భాగ ధేయాలు కావు...
ఈనాడు కన్నీరు కార్చే, వగచే, భయకంపితుడయ్యే
భీరువు ఎక్కడున్నాడు? క్షుద్రమైన ఆత్మ రక్షణ కోసం
సత్యాన్ని ఎవడు మ్లానంచేస్తాడు? నీ బాధలో స్వీయ
ధైర్య సాహసాలను చూడలేని వెన్నెముకలేని దుర్బల
జీవి ఎక్కడ ఉన్నాడు?
ఆ కన్నీటిని తుడిచివేయి ఓ కాపురుష చిత్తధావనా!
ఆగ్నేయ మాత దివ్వెని కాగడాతో వేచి ఉన్నాడు. అధికార
దండంతోనో, శృంఖలంతోనో దండించగల రా జెక్కడ
ఉన్నాడు? బంధించవలసిన శృంఖలాలు అతని పాదాల
మోకరిల్లుతాయి. కారాగారాలు అతనికి, తమ అతిథిగా,
స్వాగత మధురహాసంతో నివాళు లర్పిస్తాయి..

ఆయనపై అభియోగం నిలువలేదు. ఎందుకంటె శ్రీ అరవిందుని పేరు ఎప్పుడూ పత్రికలో పడలేదు. ఆయన 'వందేమాతరం' సంపాదకుడని ఋజువు కాలేదు; అందుకని చివరి కాయనను నిర్దోషిగా విడిచిపుచ్చ వలసి వచ్చింది. దాని వెన్నంటి వచ్చిన ప్రఖ్యాతి కోసమైనా మనం ఆ అభియోగాన్ని అభినందించాలి. ఎప్పటి కంటె గూడ శ్రీ అరవిందు లొక ప్రబల శక్తిగా తయారయ్యాడు. 'వందేమాతరం' ప్రతిష్ఠ దాని వాస్తవ వ్యావర్తకాన్ని అంటే అది అమ్ముడుపోయే ప్రతులను మించి ఇనుమడించింది. అతడు ఒక్క రాజకీయాల మీదనే వ్రాయలేదు. ఎందుకంటే, జాగరితం కావడం, విదేశీ రక్కసిని పారదోలడం, స్వీయాధ్యాత్మిక బలాన్ని ఆవాహనం చేసుకోవడం, ఆధునిక కాలం తెచ్చి పెట్టే సమస్యల పరిష్కారానికి అనుగుణంగా జీవితాన్ని దిద్దుకోవడం — ఇవన్నీ గూడ ఆయనకు భారతదర్శనంలోనే కనిపించాయి. వీటిని గురించి గూడ వ్రాయవలసి వచ్చింది. అయినా రాజకీయాలను

ప్రథమ స్థానాన్నే ఇచ్చాడు. 1907 అంతా గూడ జాతీయవాదుల (లేదా తీవ్రవాదుల) మితవాదుల మధ్య సమస్యలు తీవ్రంగా చర్చితమవుతూనే ఉన్నాయి. ఇది, డిసెంబరు సూరత్ కాంగ్రెస్‌లో ప్రత్యర్థి కూటాలు ఏర్పడటానికి దారి తీసింది. కాంగ్రెస్ బద్దలై చీలి పోయింది. మితవాదులు ఆ శకలాల నుంచి పోగుచేసుకో గలిగినంత పోగుచేసు కొంటుండగా, జాతీయవాదులు అదృష్టాన్ని భుజాల కెత్తుకొని భవిష్యత్తు లోకి లంఘించారు. చీలిక సమయంలో తిలక్ ఉపన్యసిస్తుండగా శ్రీ అరవిందులు అధ్యక్షస్థానంలో, (ఆ దృశ్యాన్ని నెవిన్సన్ వర్ణించినట్లు) "గంభీరంగా, మౌనంగా ... భావిలో ఆలోకిస్తున్నవాని వలె చూపులు దూరంగా ఎక్కడో సారిస్తూ" కూర్చున్నాడు. సూరత్ నుంచి శ్రీ అరవిందులు బరోడా పయన మయ్యాడు. అక్కడ ఆయన కోసం హృదయ పూర్వక స్వాగతం ఎదురు చూసింది.

గత కొద్ది రోజులుగ శ్రీ అరవిందులకు ఒక ఆలోచన రా సాగింది; త్వరితంగాను, ప్రతిభావంతంగాను తను లక్ష్యంగా పెట్టుకొన్న జాతి విముక్తిని సాధించ డానికి వీలుగ, తన రాజకీయ జీవితానికి యోగం, దైవసాక్షాత్కారం నూతన స్వరాన్ని అందిస్తాడేమో నని అనుకో సాగారు. నిష్ఫల వాదోపవాదాల నిమ్నోన్నతాలు, దమనభీరుల, కింకిణీరవాలు, రాజకీయ జీవిత మిథ్యా వాదాలు, క్షుద్రతలు – ఇవి ఆయనకు తీర్చలేని తొడుగు బరువు లయ్యాయి. ఈ లోపల, ప్రజల దానిసంతనం, కష్టాలు, అవమానాలు అనంతంగా యథేచ్ఛగా సాగుతూనే ఉన్నాయి. యోగం ఆయనకు సమగ్ర జ్ఞానాన్ని అందిస్తే, ఆ జ్ఞాన బలంతో దేశానికి పట్టిన దీర్ఘకాలిక పీడ నొప్పి లేకుండ నివారించలేక పోరారా ?

బరోడాలో ఉండగా ఆయనకు మహారాష్ట్రానికి చెందిన భాస్కర్ లేలె యోగీశ్వరునికి మధ్య సమావేశం ఏర్పాటైంది. అప్పు డత డిచ్చిన కొన్ని ఉపదేశాల ననుసరించి శ్రీ అరవిందుడు గాఢ ధ్యానంలోకి వెళ్ళిపోయాడు. బాహ్యా మనిపించే ఆలోచనలు రాగానే వాటిని మూలంగా త్రోసివేశాడు. ఇది కేవల చిత్తవృత్తి రాహిత్యాన్ని – (నిర్వాణ స్థితి కావచ్చు) – పొందే వరకు కొనసాగింది. పృథక్కృత అహంకార వ్యక్తిత్వం అనిర్వచనీయ మైనాయన నిశ్శబ్దంలో కరిగి పోయింది. సందేహం లేదు, గది వెలుపలికి రాగానే, మామూలుగా నడిచిపోతున్నారన్న మాటే గాని, ఆయన చేస్తున్న దేమిటో ఆయనకే తెలియదు. ఏదో నిరంతర విశ్వాసంతో

ప్రవాహంలో కొట్టుకు పోగా, ఆయన కంటె భిన్నమైన అజ్ఞాత శక్తి ఏదో ఆయనను ఆడించగా ఆయనొక తోలుబొమ్మ అయ్యాడు — వాస్తవంగా ఇక ఏమాత్రం 'తాను' అనేది లేదు. శ్రీ అరవిందులు ఆశించినది ఇది కాదు. యోగి లేలె కావాలనుకొన్నది గూడ ఇది కాదు అయితే దీనినుంచి విముక్తి గూడ లేదు. ఆయన పూనావెళ్ళి, తిలక్‌ను కలిసి, బహిరంగోపన్యాసం చేసింది ఈ స్థితిలోనే, సమాధ్యవస్థ లాంటి స్థితిలోనే ఉంటూ, పైకి మాత్రం కదలుతూ, శ్రీ అరవిందుడు బొంబాయి వచ్చి, మోహన్‌వాడి వద్ద, 1908 జనవరి 19 న, జాతీయసమాఖ్య ముందు ప్రఖ్యాతోపన్యాసాన్ని చేశాడు. అక్కడ ప్రెసిడెంట్ లేడనీ, దేవుడే ప్రెసిడెంటనీ చైర్మన్ చెప్పినప్పుడు, తన కభిముఖంగా కూర్చున్న మూడువేల మంది శ్రోతలకు చెప్పవలసింది తన దగ్గర ఏమీ లేదని శ్రీ అరవిందుల కనిపించింది. కాని లేలె సలహాపై ఆయన లేచి నిలబడి నమస్కార పురస్సరంగా చేతులు ముకుళించి క్షణ కాలం ఆగాడు. అప్పుడు ఆకస్మికంగా అగాధ సతత ప్రవాహిత సుధా నిర్ఝరి నుంచి పొంగి పొరలి వస్తున్నట్లు పదజాలం అప్రయత్నంగా, అనాలోచితంగా, సరైన పదాలు ఉపయోగిస్తున్నానా లేదా అన్న స్పృహ లేకుండా, శ్రోతలను ఆకట్టుకోవాలనే దృష్టి లేకుండా రా సాగింది. అది ఒక నూతన వాణి, నూతన సంగీతం, నూతన ఆవశ్యకత, నూతన ఆవిష్కారం, నూతన నిర్దేశం :

"..మీకు నిజమైన విశ్వాసం ఉందా? లేక అది ఒక రాజకీయ ఆకాంక్ష? అది కేవలం ఒక విధమైన మహా స్వార్థమా? లేక ఇతరులు మిమ్మణగద్రొక్కినట్లు మీరు వారిని అణగద్రొక్కడానికి స్వేచ్ఛ కావాలనుకొంటున్నారా? మీ రాజకీయ సిద్ధాంతానికి యేదైన ఉన్నతమైన మూలాధారం ఉందా? మీలో ఉదయించింది భగవానుడేనా? మీరు కేవలం నిమిత్తమాత్రులని, భగవానుని చేతిలో ఉపకరణాలని, మీ శరీరాలు మీవి కావని గుర్తించారా? .. శాశ్వతాంధకారావమానాల నుంచి దీప్తిని, భారతీయాత్మను తప్పించడంలో మీరు దేవుని పరికరాలు."

మలచాలి. అలా చేసినట్లయితే మీ పని మీరు చేసినట్లవుతుంది.
అప్పుడు మీరు నిర్వహిస్తున్నది కేవల రాజకీయోద్యమం కాదని,
చేస్తున్నది కేవల రాజకీయ పరివర్తనం కాదని, అది దైవకార్య
నిర్వహణకై మీకు వచ్చిన 'పిలుపు' అని మీరు గుర్తిస్తారు."

ఇది రాజకీయోద్యమం కాదని చెప్పక చెబుతోంది. అయినా 'దీని' ప్రభావం రాజకీయంగా గూడ వెల్లువై ప్రవహించేదిగా ఉంది. భగవంతుడు జాతీయ సేనా వాహిని పక్షాన ఉన్నాడు. భారతావని విముక్తి అనివార్యం, ఆదేశం చెట్టుపై ఉన్న ఒక సామాన్యమైన పక్షి, బంగారు పిట్టను చూచి, తన నిజాత్మను గుర్తించినట్లు వారు జాగరిత భారతావని ఉజ్జ్వల దర్శనాన్ని వీక్షిస్తే చాలు, ఆ దర్శనం తనకై తానే యదార్థమై పోతుంది.

బొంబాయి ఉపన్యాసం చాల మందికి కూడ ప్రబంధమై ఆసక్తి రేకెత్తించింది. అంది అందనిదైంది. ఎందుకంటె, ఆయనకు బరోడాలో కలిగిన 'నిర్వాణానుభవం' దాదాపుగ ఎవరికీ తెలియదు. ఒకసారి బొంబాయిలో ఒక మిత్రుని భవంతి పై అంతస్తు మీద నిలబడి, కింద వీధిలో అనంతంగా ప్రవహించే జనసందోహాన్ని చూచినప్పుడు, అది అంతా ఆయనకు ఒక సినిమాలా 'అసారం'గా గోచరించింది. బరోడాలో అనుభవానికి వచ్చిన కేవల శూన్యత ప్రశాంతతలు, బొంబాయిలో గోచరించిన లోక జీవిత నిస్సారతానుభవం — రెండూ మిళితమై ఆయన రచించిన ఈ క్రింది గీతంలో కనిపిస్తాయి :

అంతా విలుప్తమైంది మూగ 'ఏకం' తప్ప
చింతన నుంచి విడివడిన మనస్సు, దుఃఖంనుంచి విముక్తమైన హృదయం
నిష్క్రియత్వం గాఢంగ అని 'అసత్తు' లోకి మారిపోతున్నాయి
జ్ఞానాజ్ఞాతమైన ఎటువంటి 'నేను' గాని, 'ప్రకృతి' గాని లేదు.
నగరం — మాట పలుకు లేని ఛాయాచిత్రం — ప్లవిస్తున్నది,
'అవాస్తవికమై' స్పందిస్తున్నది. ఎడతెరిపిలేని రూపాలు

సినిమా శూన్యాకృతుల వలె ప్రవహిస్తున్నవి ...

అపరిమేయ శాశ్వతత్వం మాత్రమే ఇక్కడ ఉన్నది.

విస్మాపక, లక్షణ రహిత నిశ్చల శాంతి ఒకటి

అన్నింటి స్థానాన్ని ఆక్రమిస్తున్నది ...

రాజకీయాలను రాజకీయాలుగ చూస్తే, వాటిలో తమ పాలు అల్పమని ఆయన కొక భావన కలుగ సాగింది. ఆయనలో అంతర్గత పరివర్తన మేదో ఒకటి జరుగుతోంది. కాని అదేమిటో ఆయనకే తెలియదు.

నాసిక్, దౌలియా, అమరావతి, నాగపూర్‌లలో మజిలీలు చేస్తూ బొంబాయి నుంచి కలకత్తాకు సాగిన ఆయన పయనం ఒక జైత్ర యాత్ర. అయినా ఆయనలోని ఆ అలౌకిక ఆంతరంగిక ప్రశాంతి మాత్రం చెక్కు చెదరలేదు. ఆయన ఉపన్యాసాలు చేస్తూనే ఉన్నాడు, వ్యాసాలు వ్రాస్తూనే ఉన్నాడు. కాని అది అంతా ఆయన అంతరంగంలో కూర్చున్న యేదో ఒక శక్తి తోసి నడిపిస్తున్నట్లుగా ఉంది. ఆయన లోని పూర్వ 'అహం' తనను తానే చంపుకొన్నట్లుగా ఉంది. అప్పు డప్పు డాయన 'వందేమాతరం' కు రచనలు పంపుతూనే ఉన్నాడు. ఆ రచనలలో, ముఖ్య లక్ష్యమైన జాతి విమోచనతో పాటు, ఆసియా పునరుజ్జీవనం, వసుధైక కుటుంబాలు గూడ శ్రుతి కలిపి కనిపించేవి. సూరత్ చీలికకు కొద్ది కాలం ముందు, శ్రీ అరవిందుడు, ఆసియా ప్రాచ్య దేశాల పునరుజ్జీవనానికి సంబంధించి కొన్ని చరిత్రార్థమైన నిర్దేశాలు చేశాడు : 10 ఏప్రిల్, 1907న ప్రచురితమైన ఒక వ్యాసంలో ఆయన ఇలా ప్రకటించాడు : "నూతన ఆసియా ప్రాదుర్భావానికి, ప్రాగ్దేశాధునికీకరణానికి ఇప్పుడు మనం దోహదం చేస్తున్నాము" తరువాతి మరొక వ్యాసంలో జపాన్ చేతిలో రష్యా పరాజయాన్ని ఉటంకించాడు; పర్షియా, ఆఫ్ఘనిస్థాన్, చైనాలలో పునరుజ్జీవనాన్ని అవలోకించి 'భవిష్యత్తు ఇలా ఉంటుందనే నిర్ణయానికి వచ్చాడు :

"కాని కాలాత్మ (Time - Spirit) దేశాంతరాలలో ఉంది . ప్రాచ్యం

తలెత్తు తుంది; భారతావని పూర్వ వైభవాన్ని పొందుతుంది.

(ఆమెపై జరిగే) దమనకాండ ఆమె వైభవాన్ని పెంచి, ఇతర దేశాలకు అగ్ర భాగాన నిలపడంలో సహాయపడుతుంది."

మళ్ళీ 16 మార్చి, 1908 న ప్రచురితమైన ఒక వ్యాసంలో ఇలా చెప్పాడు :

" 'ఆత్మ పరంగా చూస్తే మానవులంతా ఒకటే నని. అందరిలోను ఉన్న దివ్యఆత్మ ఒకటేనని', క్రైస్తవం ప్రతిపాదిస్తుంది కనుక, క్రైస్తవం ద్వారా ప్రజాస్వామ్యం ప్రాచ్యం నుంచి పాశ్చాత్యానికి వచ్చిందని ఆయన భావించాడు." మహమ్మదు గూడ ఆత్మ పరంగా మానవులంతా సమానమే నన్నే పైగాము (సందేశం) ను ప్రబోధింప ప్రయత్నించాడు. ఇస్లామ్ ప్రకారం మానవులంతా సోదరులు 'ఆధ్యాత్మిక ఐక్యత' ఇతర వేర్పాటు శక్తులను అధిగమించాలని భావించబడింది. భారతదేశంలో వేదాలు చెప్పే సందేశం ఎప్పుడూ గూడ, 'ఆత్మ ద్వారానే మానవుని దివ్యత్వంతో కలపాలని' చెప్పింది. ఇది మానవ విమోచనానికి మానవ సమతకు, మానవ సౌభాతృత్వానికి నిజమైన మూలం :

"ఆత్మగతమైన స్వేచ్ఛ మనిషికి ఉన్నప్పుడు, మిగతా స్వేచ్ఛ లన్నీ అతని అదుపు ఆజ్ఞలలో ఉంటాయి. ఈ దివ్య సమతను గ్రహించినప్పుడు, అతడు ఈ ప్రపంచానికే సోదరుడవుతాడు అతనిని ఏ స్థానంలో ఉంచినా, ప్రేమ, న్యాయం, ధర్మ సూత్రాల ప్రకారం మానవు లందరిని సోదరులుగ ఎంచి సేవ చేస్తాడు. ఈ అవగాహన, మతానికి, తత్త్వానికి, సామాజిక పరికల్పనకు, రాజకీయ ఆశంసనలకు ఆధారమైనప్పుడు, స్వేచ్ఛ సమత సౌభ్రాతృత్వాలు సమాజ రచనలో తమ తమ స్థానాలలో ఉంటాయి. సత్య యుగం పునరాగమనం చేస్తుంది."

లజపతిరాయ్, సర్దార్ అజిత్‌సింగ్, వి. ఒ. చిదంబరం పిళ్ళై, బిపిన్‌చంద్రపాల్, అశ్వనీకుమార్‌దత్తా లాంటి శిఖరాయమాన మహోన్నత వ్యక్తులున్నారు — అయినా శ్రీ అరవిందులు మహోదరి నుంచి, దాదాపు అదృశ్యంగానే, నాయకత్వం వహించాడు. ఆయన జాతి విమోచన, పునరావాసాల మహా యజ్ఞానికి రహస్యాగ్ని.

రోజులు గడిచే కొలది, "ప్రాసంగికంగా" (By the way) అనే శీర్షిక క్రింద "వందేమాతరం"లో వెలువడుతున్న సంపాదకీయ ప్రక్షేపణాస్త్రాలు జనాభిప్రాయాన్ని కూడగట్టుకు రా సాగాయి. విదేశీ నియంతృత్వానికి వ్యతిరేకంగా దేశంలో స్థిరాభిప్రాయాన్ని నెలకొల్పాయి. ప్రభుత్వానికి మద్దతునిచ్చే వారిని, ప్రభుత్వం నుంచి భిక్షను యాచించే వారిని అవి తికమక పెట్టాయి. ప్రభుత్వం అరుణిమ దాల్చింది; సెగలు పొగలు కక్కింది. కాని చర్య తీసుకోవడానికి అశక్త మయింది. ఎందుకంటె, పైకి కనిపించకుండ అంతర్లీన విప్లవ ధ్వనిని నిక్షిప్తంచేసి వ్రాసిన వ్యాసాలివి. వాటిని ఆయన చట్టం పిడికిళ్ళకు చిక్కనంతటి పైశాచిక చాతుర్యం (అది ప్రభుత్వం అన్నమాట) తో వ్రాశారు. జాతీయ వాదుల వెనుక నిలబడ్డ 'చాలన శక్తి' శ్రీ అరవిందులనడంలో సందేహం లేదు. ప్రసిద్ధ "భవానీ మందిర్" రచయితగా ఆయన విప్లవ వాదుల కు తేజం. అందుకని ప్రభుత్వం అతని మీద అభియోగం చేవాలనుకొంది. ఆ అభియోగం గూడ అతడేమైన స్వయంగా వ్రాశాడని కాదు; అతని సోదరుడు నరేంద్రకుమార్ ఘోష్ సంపాదకత్వం వహిస్తున్న బెంగాలీ "యుగంతర్" లో ప్రచురితమైన కొన్ని వ్యాసాల ఆంగ్లానువాదాలను "వందేమాతరం" లో ప్రకటించినందుకే ఆ అభియోగం జూలై 1907 లో ఆకస్మికంగా శ్రీ అరవిందుని జైలులో పెట్టి అభియోగం మోపడంతో ఆయన పేరు దేశవ్యాప్తంగా తెలిసింది. భారతదేశం నలుమూలలనుంచి అనేక ప్రశంసలు అందాయి. వాటిలో రవీంద్రనాథ్ ఠాగోర్ నుంచి వచ్చింది గణ్యమైంది, శాశ్వతమైంది. కారణం, ఆరోజుల్లో ఆయన పేరుమోసిన వాడవడమే కాకుండ శ్రీ అరవిందుల కంటె ఎంతో పెద్దవాడు. "హే అరవిందో, రవీంద్రుడు నీకు ప్రణమిల్లుచున్నాడు!" తో ఆయన పంపిన పద్య మారంభ మవుతుంది. ఈ గౌరవ పురస్సరమైన గుణ గ్రహణ వ్యగ్రత పద్య మంతట ప్రదర్శిత మైంది —

హే మిత్రమా, నా వేళ హితుడా, హే స్వేచ్ఛాయుత,
మూర్తీభవించిన భారతీయాత్మ వాణీ। యే సేవ యశస్సు
నీ అదృష్టాన్ని అధివసించును;
అన్యాయార్జిత విత్తం, ప్రమత్త స్వాంతనాయి నీ భాగధేయాలు కావు...
ఈనాడు కన్నీరు కార్చే, పగచే, భయకంపితు డయ్యే
ధీరుడు ఎక్కడున్నాడు? క్షుద్రమైన ఆత్మ రక్షణ కోసం
సత్యాన్ని ఎవడు న్యూనంచేస్తాడు? నీ బాధలో స్వీయ
ధైర్య సాహసాలను చూడలేని వెన్నెముకలేని దుర్బల
జీవి ఎక్కడ ఉన్నాడు?
ఆ కన్నీటిని తుడిచివేయి ఓ కాపురుష చిత్తభావనా!
ఆగ్నేయ మాత ఉపుని కాగడాతో వేచి ఉన్నాడు. అతనిని
దండంతోనో, శృంఖలంతోనో దండించగల రా జెక్కడ
ఉన్నాడు? బంధించవలసిన శృంఖలాలు అతని పాదాల
మోకరిల్లురాయి. కారాగారాలు అతనికి, తప అతిథిగా,
స్వాగత సదురహాసంతో నివాళ లర్పిస్తాయి..

ఆయనపై అభియోగం నిలుపలేదు. ఎందుకంటె శ్రీ అరవిందుని పేరు ఎప్పుడూ పత్రికలో పడలేదు. ఆయన 'వందేమాతరం' సంపాదకు డని ఋజువు కాలేదు; అందుకని చివరి కాయనను నిర్దోషిగా విడిచిపుచ్చ వలసి వచ్చింది. దాని వెన్నంటి వచ్చిన ప్రఖ్యాతి కోసమైనా మనం ఆ అభియోగాన్ని అభినందించాలి. ఎప్పటి కంటె గూడ శ్రీ అరవిందు లొక ప్రబల శక్తిగా తయారయ్యాడు. 'వందేమాతరం' ప్రతిష్ఠ దాని వాస్తవ వ్యావర్తకాన్ని అంటే అది అమ్ముడుపోయే ప్రతులను మించి ఇనుమడించింది. అతడు ఒక్క రాజకీయాల మీదనే వ్రాయలేదు. ఎందుకంటే, జాగరితం కావడం, విదేశీ రక్కసిని పారదోలడం, స్వీయాధ్యాత్మిక బలాన్ని ఆవాహనం చేసుకోవడం, ఆధునిక కాలం తెచ్చి పెట్టే సమస్యల పరిష్కారానికి అనుగుణంగా జీవితాన్ని దిద్దుకోవడం — ఇవన్నీ గూడ ఆయనకు భారతదర్శనంలోనే కనిపించాయి. వీటిని గురించి గూడ వ్రాయవలసి వచ్చింది. అయినా రాజకీయాలకు

ప్రధమ స్థానాన్నే ఇచ్చారు. 1907 అంతా గూడ జాతీయవాదుల (లేదా తీవ్రవాదుల) మితవాదుల మధ్య సమస్యలు తీవ్రంగా చర్చితమవుతూనే ఉన్నాయి. ఇది, డిసెంబరు సూరత్ కాంగ్రెస్‌లో ప్రత్యర్థి కూటాలు ఏర్పడటానికి దారి తీసింది. కాంగ్రెస్ బద్దలై చీలి పోయింది. మితవాదులు ఆ శకలాల నుంచి పోగుచేసుకో గలిగినంత పోగుచేసు కొంటుండగా, జాతీయవాదులు అదృష్టాన్ని భుజాల కెత్తుకొని భవిష్యత్తు లోకి లంఘించారు. చీలిక సమయంలో తిలక్ ఉపన్యసిస్తుండగా శ్రీ అరవిందులు అధ్యక్షస్థానంలో, (ఆ దృశ్యాన్ని నెవిన్‌సన్ వర్ణించినట్లు) "గంభీరంగా, మౌనంగా . భావిలో ఆలోకిస్తున్నవాని వలె చూపులు దూరంగా ఎక్కడో సారిస్తూ" కూర్చున్నాడు. సూరత్ నుంచి శ్రీ అరవిందులు బరోడా పయన మయ్యాడు. అక్కడ ఆయన కోసం హృదయ పూర్వక స్వాగతం ఎదురు చూసింది.

గత కొద్ది రోజులుగ శ్రీ అరవిందులకు ఒక ఆలోచన రా సాగింది; త్వరితంగాను, ప్రతిభావంతంగాను తను లక్ష్యంగా పెట్టుకొన్న జాతి విముక్తిని సాధించ డానికి వీలుగ, తన రాజకీయ జీవితానికి యోగం, దైవసాక్షాత్కారం నూతన స్వరాన్ని అందిస్తాయేమో నని అనుకో సాగారు. నిష్ఫల వాదోపవాదాల సిద్ధాంతాలు, దపసభీతుల, కింకర్తవ్యాలు, రాజకీయ జీవిత మిధ్యా వాదాలు, క్షుద్రతలు — ఇవి ఆయనకు ఈర్ష్యలేని తోడుగు బరువు లయ్యాయి. ఈ లోపల, ప్రజల బానిసతనం, కష్టాలు, అవమానాలు అనంతంగా యధేచ్ఛగా సాగుతూనే ఉన్నాయి. యోగం ఆయనకు సమగ్ర జ్ఞానాన్ని అందిస్తే, ఆ జ్ఞాన బలంతో దేశానికి పట్టిన దీర్ఘకాలిక ఓద నొప్పి లేకుండ నివారించలేక పోదారా ?

బరోడాలో ఉండగా ఆయనకు మహారాష్ట్రానికి చెందిన ధాన్కర లేలె యోగీశ్వరునికి మధ్య సమావేశం ఏర్పాటైంది. అప్పు డత డిచ్చిన కొన్ని ఉపదేశాల ననుసరించి శ్రీ అరవిందుడు గాఢ ధ్యానంలోకి వెళ్ళిపోయాడు. బాహ్య మనిపించే ఆలోచనలు రాగానే వాటిని దూరంగా త్రోసివేశాడు. ఇది కేవల చిత్తవృత్తి రాహిత్యాన్ని — (నిర్వాణ స్థితి కావచ్చు) — పొందే వరకు కొనసాగింది. పృథక్కృత అహంకార వ్యక్తిత్వం అనిర్వచనీయ మైన ఆయన నిశ్శబ్దంలో కరిగి పోయింది. సందేహం లేదు, గది వెలుపలికి రాగానే, మామూలుగా నడిచిపోతున్నారన్న మాటే గాని, ఆయన చేస్తున్న దేమిటో ఆయనకే తెలియదు. ఏదో నిరంతర విశ్వశక్తితో

ప్రవాహంలో కొట్టుకు పోగా, ఆయన కంటె భిన్నమైన అజ్ఞాత శక్తి ఏదో ఆయనను ఆడించగా ఆయనొక తోలుబొమ్మ అయ్యాడు — వాస్తవంగా ఇక ఏమాత్రం 'తాను' అనేది లేదు. శ్రీ అరవిందులు ఆశించినది ఇది కాదు. యోగి లేలె కావాలనుకొన్నది గూడ ఇది కాదు అయితే దీనినుంచి విముక్తిగూడ లేదు. ఆయన పూనావెళ్ళి, తిలక్‌ను కలిసి, బహిరంగోపన్యాసం చేసింది ఈ స్థితిలోనే. సమాధ్యవస్థ లాంటి స్థితిలోనే ఉంటూ, పైకి మాత్రం కదలుతూ, శ్రీ అరవిందుడు బొంబాయి వచ్చి, మోహన్‌వాడి వద్ద, 1908 జనవరి 19 న, జాతీయసమాఖ్య ముందు ప్రఖ్యాతోపన్యాసాన్ని చేశాడు. అక్కడి ప్రెసిడెంట్ లేడనీ, దేవుడే ప్రెసిడెంటనీ చైర్మన్ చెప్పినప్పుడు, తన కభిముఖంగా కూర్చున్న మూడువేల మంది శ్రోతలకు చెప్పవలసింది తన దగ్గర ఏమీ లేదని శ్రీ అరవిందుల కనిపించింది. కాని లేలె సలహాపై ఆయన లేచి నిలబడి సమస్కార పురస్సరంగా చేతులు ముకుళించి క్షణ కాలం ఆగాడు. అప్పుడు ఆకస్మికంగా అగాధ సతత ప్రవాహిత సుధా నిర్ఝరి నుంచి పొంగి పొరలి వస్తున్నట్లు పదజాలం అప్రయత్నంగా, అనాలోచితంగా, సరైన పదాలు ఉపయోగిస్తున్నానా లేదా అన్న స్పృహ లేకుండా, శ్రోతలను ఆకట్టుకోవాలనే దృష్టి లేకుండా రా సాగింది. అది ఒక నూతన వాణి, నూతన సంగీతం, నూతన ఆవశ్యకత, నూతన ఆవిష్కారం, నూతన నిర్దేశం :

"..మీకు నిజమైన విశ్వాసం ఉందా? లేక అది ఒక రాజకీయ ఆకాంక్ష? అది కేవలం ఒక విధమైన మహా స్వార్థమా? లేక ఇతరులు మిమ్మణగద్రొక్కినట్లు మీరు వారిని అణగద్రొక్క డానికి స్వేచ్ఛ కావాలనుకొంటున్నారా? మీ రాజకీయ సిద్ధాంతానికి యేదైన ఉన్నతమైన మూలాధారం ఉందా? మీలో ఉదయించింది భగవానుడేనా? మీరు కేవలం నిమిత్తమాత్రులని, భగవానుని చేతిలో ఉపకరణాలని, మీ శరీరాలు మీవి కావని గుర్తించారా? .. శాశ్వతాంధకారావమానాల నుంచి దీప్తిని, భారతీయాత్మను తప్పించడంలో మీరు దేవుని పరికరాలు."

విధానాలు పథకాలు ముఖ్యమైనవే. అంతకంటె ముఖ్యమైంది విశ్వాసబలం, అంతరంగం లోని అభిమంత్రిత భగవానుని నుంచి పొరలి వచ్చే శక్తి. వారు చేయవలసింది జాతిలో దేవుని దర్శించడం, దైత్యుని, అసురుని, రాక్షసుని నిర్జించడం, అందులో భయపడవలసిం దేమీ లేదు. మృత్యువంతటిది గూడ ఆ జనని బిడ్డలను ఏమీ చేయలేదు ఎందుకంటె వారి లోపల ఉన్నది స్వచ్ఛమైన స్ఫటిక సదృశ అధిష్ఠాతం. అది అమర్త్యం, అజాతం, అనశ్వరం, దానిని కృపాణాలు చీల్చలేవు, అగ్ని దహించలేదు, జలం నిమజ్జనం చేయలేదు — అటువంటి దానిని ఈ న్యాయ స్థానాలు, ప్రపంచంలోని శక్తులన్నీ గూడ యేమీ చేయలేవు. తరింపజేసే తన ఉపన్యాసాన్ని శ్రీ అరవిందుడు ఇలా ముగించాడు;

> "ఎవరూ అడ్డుకోలేని ఒక మహోద్యమాన్ని మీరు చూస్తారు. ఏ శక్తి అడ్డలేని ఒక మహా వికాసాన్ని మీరు దర్శిస్తారు. జాతిలో ఒక నూతన అవతారాన్ని మీరు చూస్తారు. మీలో ఉన్న ఆ భగవానునికి మీరు స్వాగతం పలికినట్లయితే, మీలో ఉన్న ఆ శక్తిని పరిగ్రహించి నట్లయితే, మిగతా భారతావని నంతా భగవంతుడు పరివర్తిస్తాడు ... భగవంతుడు తనంత తానే మీలో ప్రభవించబోతున్నాడు. ఎందుకు — మీరూ ఇతర జాతులకు వలె ఉండాలని కాదు, బహుగు జనాన్ని మీరు పాదాల క్రింద నలిపివేయడానికని కాదు. కేవల మానుష శక్తితో మీరంతా పైకి రావాలని కాదు; కాని ప్రపంచం మొత్తాన్ని తరింప జేసేది యేదో మీలో ప్రభవించాలని. ఆ తరింపజేసేది ఏదో మన ప్రాచీన ఋషిపుంగవులకు తెలుసు. వారు దానిని తెలియజెప్పారు గూడ. దానినే మీరు తెలియవలసి ఉంది. తెలియజెప్పవలసి ఉంది. భగవంతుడు తనంత తాను మీలో అభివ్యక్తం కాబోయే ముందు మీలోని ఆయనను గుర్తించాలి మీ జీవితాలను మీరు సరిదిద్దుకోవాలి. ఆయన ప్రభవించడానికి వీలుగ ఈ మహా జాతి జీవన సరళిని మీరు

మలచాలి. అలా చేసినట్లయితే మీ పని మీరు చేసినట్లవుతుంది. అప్పుడు మీరు నిర్వహిస్తున్నది కేవల రాజకీయోద్యమం కాదని, చేస్తున్నది కేవల రాజకీయ పరివర్తనం కాదని, అది దైవకార్య నిర్వహణకై మీకు వచ్చిన 'పిలుపు' అని మీరు గుర్తిస్తారు."

ఇది రాజకీయోద్యమం కాదని చెప్పక చెబుతోంది. అయినా 'దీని' ప్రధానం రాజకీయంగా గూడ వెల్లువై ప్రవహించేదిగా ఉంది. భగవంతుడు జాతీయ సేనా వాహిని వద్దనే ఉన్నాడు. భారతావని విముక్తి అనివార్యం, ఆదేశితం. చెట్టుపై ఉన్న ఒక సామాన్యమైన పక్షి, బంగారు పిట్టను చూచి, తన నిజాత్మను గుర్తించినట్లు వారు జాగరిత భారతావని ఉజ్జ్వల దర్శనాన్ని వీక్షిస్తే చాలు, ఆ దర్శనం తనకై తానే యదార్థమై పోతుంది.

బొంబాయి ఉపన్యాసం చాల మందికి కూడ ప్రబంధమై ఆసక్తి రేకెత్తించింది. అంటే అందనిదైంది. ఎందుకంటే, ఆయనకు బరోడాలో కలిగిన 'నిర్వాణానుభవం' దాదాపుగ ఎవరికీతెలియదు. ఒకసారి బొంబాయిలో ఒక మిత్రుని భవంతి పై అంతస్తు మీద నిలబడి, కింద వీధిలో అనంతంగా ప్రవహించే జనసందోహాన్ని చూచినప్పుడు, అది అంతా ఆయనకు ఒక సినిమాలా 'అసారం'గా గోచరించింది. బరోడాలో అనుభవానికి వచ్చిన కేవల శూన్యత ప్రశాంతతలు, బొంబాయిలో గోచరమైన లౌకిక జీవిత నిస్సారతానుభవం — రెండూ మిళితమై ఆయన రచించిన ఈ క్రింది గీతికలో కనిపిస్తాయి

అంతా విలుప్తమైంది మూగ 'ఏకం' తప్ప
చింతన నుంచి విడివడిన మనస్సు, దుఃఖంనుంచి విముక్తమైన హృదయం
నమ్మ శక్యం గాకుండ అవి 'అవస్తు'లోకి మారిపోతున్నాయి
జ్ఞాతృజ్ఞాతమైన ఎటువంటి 'నేను' గాని, 'ప్రకృతి' గాని లేదు.
నగరం — మాట పలుకు లేని ఛాయాచిత్రం — స్ఫురిస్తున్నది,
'అవాస్తవికమై' స్పందిస్తున్నది. ఎడతెరిపిలేని రూపాలు

సినిమా శూన్యాకృతుల వలె ప్రవహిస్తున్నవి ...
అపరిమేయ శాశ్వతత్వం మాత్రమే ఇక్కడ ఉన్నది.
నిర్వ్యాపక, లక్షణ రహిత నిశ్చల శాంతి ఒకటి
అన్నింటి స్థానాన్ని ఆక్రమిస్తున్నది ...

రాజకీయాలను రాజకీయాలుగ చూస్తే, వాటిలో తమ పాలు అల్పమని ఆయన కొక భావన కలుగ సాగింది. ఆయనలో అంతర్గత పరివర్తన మేదో ఒకటి జరుగుతోంది. కాని అదేమిటో ఆయనకే తెలియదు.

నాసిక్, ధౌలియా, అమరోతి, నాగపూర్‌లలో మజిలీలు చేస్తూ బొంబాయి నుంచి కలకత్తాకు సాగిన ఆయన పయనం ఒక జైత్ర యాత్ర. అయినా ఆయనలోని ఆ అలౌకిక అంతరంగిక ప్రశాంతి మాత్రం చెక్కు చెదరలేదు. ఆయన ఉపన్యాసాలు చేస్తూనే ఉన్నాడు, వ్యాసాలు వ్రాస్తూనే ఉన్నాడు. కాని అది అంతా ఆయన అంతరంగంలో కూర్చున్న దేదో ఒక శక్తి తోసి నడిపిస్తున్నట్లుగా ఉంది. ఆయన లోని పూర్వ 'అహం' తనను తానే చంపుకొన్నట్లుగా ఉంది. అప్పు డప్పు డాయన 'వందేమాతరం'కు రచనలు పంపుతూనే ఉన్నాడు. ఆ రచనలలో, ముఖ్య లక్ష్యమైన జాతి విమోచనతో పాటు, ఆసియా పునరుజ్జీవనం, వసుధైక కుటుంబాలు గూడ స్ఫృతి కలిపి కనిపించేవి. సూరత్ చీలికకు కొద్ది కాలం ముందు, శ్రీ అరవిందుడు, ఆసియా ప్రాచ్య దేశాల పునరుజ్జీవనానికి సంబంధించి కొన్ని చరిత్రార్థమైన నిర్దేశాలు చేశాడు. 16 ఏప్రిల్, 1907 న ప్రచురితమైన ఒక వ్యాసంలో ఆయన ఇలా ప్రకటించాడు. "మానవ ఆసియా ప్రాదుర్భావానికి, ప్రాగ్దేశాధునికీకరణానికి ఇప్పుడు మనం దోహదం చేస్తున్నాము" తరువాతి మరొక వ్యాసంలో జపాన్ చేతిలో రష్యా పరాజయాన్ని ఉటంకించాడు; పర్షియా, ఆఫ్ఘనిస్థాన్, చైనాలలో పునరుజ్జీవనాన్ని అవలోకించి 'భవిష్యత్తు ఇలా ఉంటుందనే నిర్ణయానికి వచ్చాడు.

"కాని కాలాత్మ (Time - Spirit) దేశాంతరాలలో ఉంది .. ప్రాచ్యం
తలెత్తు తుంది; భారతావని పూర్వ వైభవాన్ని పొందుతుంది.

(ఆమెపై జరిగే) దమనకాండ ఆమె వైభవాన్ని పెంచి, ఇతర దేశాలకు అగ్ర భాగాన నిలవడంలో సహాయపడుతుంది."

మళ్ళీ 16 మార్చి, 1908 న ప్రచురితమైన ఒక వ్యాసంలో ఇలా చెప్పాడు :

"'ఆత్మ పరంగా చూస్తే మానవులంతా ఒకటే నని. అందరిలోను ఉన్న దివ్యఆత్మ ఒకటేనని', క్రైస్తవం ప్రతిపాదిస్తుంది కనుక, క్రైస్తవం ద్వారా ప్రజాస్వామ్యం ప్రాచ్యం నుంచి పాశ్చాత్యానికి వచ్చిందని ఆయన భావించాడు." మహమ్మదు గూడ ఆత్మ పరంగా మానవులంతా సమానమే ననే పైగాము (సందేశం) ను ప్రబోధించ ప్రయత్నించాడు. ఇస్లామ్ ప్రకారం మానవులంతా సోదరులు. 'ఆధ్యాత్మిక ఐక్యత' ఇతర వేర్పాటు శక్తులను అధిగమించాలని భావించబడింది. భారతదేశంలో వేదాలు చెప్పే సందేశం ఎప్పుడూ గూడ, 'ఆత్మ ద్వారానే మానవుని దివ్యత్వంతో కలపాలని' చెప్పింది. ఇది మానవ విమోచనానికి మానవ సమతకు, మానవ సౌభ్రాతృత్వానికి నిజమైన మూలం :

"ఆత్మగతమైన స్వేచ్ఛ మనిషికి ఉన్నప్పుడు, మిగతా స్వేచ్ఛలన్నీ అతని అదుపు ఆజ్ఞలలో ఉంటాయి... ఈ దివ్య సమతను గ్రహించినప్పుడు, అతడు ఈ ప్రపంచానికే సోదరుడవుతాడు అతనిని ఏ స్థానంలో ఉంచినా, ప్రేమ, న్యాయం, ధర్మ సూత్రాల ప్రకారం మానవు లందరిని సోదరులుగ ఎంచి సేవ చేస్తాడు. ఈ అవగాహన, మతానికి, తత్వానికి, సామాజిక పరికల్పనకు, రాజకీయ ఆశంసనలకు ఆధారమైనప్పుడు, స్వేచ్ఛ సమత సౌభ్రాతృత్వాలు సమాజ రచనలో తమ తమ స్థానాలలో ఉంటాయి. సత్య యుగం పునరాగమనం చేస్తుంది."

ముందు ముందు కాలంలో శ్రీ అరవిందుడు చెప్పబోయే రాజకీయ సామాజిక భావాలలోని ఔన్నత్యాన్ని, నిండుదనాన్ని మనం బీజ రూపంలో ఇక్కడే చూస్తున్నాము. ఇప్పటికే అయన ఆసియాను గురించే కాక సమస్త ప్రపంచాన్ని గురించి ఆలోచిస్తున్నాడు. మూడు వారాల తరవాత ప్రచురితమైన ఒక వ్యాసంలో అయన ఇలా స్పష్టం చేశాడు. ఒక సర్వాలోకనంతో మానవ చరిత్రనే సందర్శించాడు; పాశ్చాత్య ప్రగతిని క్రోడీకరించాడు; ఘంతదేశ అతి జీవనంలో (Survival) ఉన్న అవశేష రహస్యాన్ని (Residual secret) నిరూపించి, రాబోయే సమన్వయాత్మక (Synthesis) లక్షణాలను స్థూలంగా జోస్యం చెప్పాడు :

"యూరోపియన్లు భౌతిక జీవితాన్ని కొస కంట అనుభవించారు ... ఇంగ్లండ్ తన వ్యవహార దక్షతతో, ఫ్రాన్స్ తన విస్పష్ట తార్కిక బుద్ధితో, జర్మనీ తన కాల్పనిక మేధతో, రష్యా తన ఔద్వేగిక శక్తితో అమెరికా తన వాణిజ్య బలంతో, మానవ వికాసానికి చేయగలిగిన దంతా చేశాయి. కాని ప్రతి దేశం తన విశేష శక్తి పరాకాష్ఠను అందుకొంది. ఐరోపా అందివ్వలేని దేదో కొంత ఉండిపోయింది. సరిగా ఈసమయంలో ఆసియా జాగరితమైంది. ఎందు కంటె ప్రపంచానికి దాని ఆవశ్యకత ఉంది. ఆసియా ప్రపంచ శాంతి పరిరక్షకురాలు; ఐరోపా సంజనిత రుగ్మతలకు భిషగ్వరం .. ఐరోపా బలం విశ్లేషణం (Details) లో ఉంటే ఆసియా బలం సంశ్లేషణం (Synthesis) లో ఉంది. జీవితానికి సంబంధించిన, లేదా ఆలోచనకు సంబంధించిన విశ్లేషణాన్ని ఐరోపా పరిపూర్ణం గావించగలిగింది గాని, ఆ విశ్లేషణాన్ని (వివరాలను) పరిపూర్ణంగా ఏకీకృతం చేయలేక పోయింది, సమన్వయం చేయలేక పోయింది. బౌద్ధిక పాషండ మార్గంలో, జీవిత సత్యాలను, మానవ సహజ పరిమితులను, సాంసారిక పరమ సత్యాలను, కాదనే వ్యావహారిక అమితత్వంలో

పడిపోయింది. అందుకు ఐరోపా స్థాణువై పోయినప్పుడు, వృథా పరికల్పనల సంఘర్షణంలో, నిరర్థక ప్రయోగాలలో, తను తప్పిదాల ఫలితాల నుంచి తప్పించుకొనే ప్రయత్నంలో ఐరోపా భ్రంశమై పోయినప్పుడు, మానవ పరిణామ కర్మను చేపట్టవలసింది ఆసియాయే. ప్రపంచ చరిత్రలో ఇప్పుడు అటువంటి సమయం ఆసన్నమైంది."

అలాంటప్పుడు, భారతదేశం, ముందు తనను తాను తెలుసుకోవాలి. ఆ కార్యక్రమంలో విదేశీ ప్రభుత్వాన్ని 'పుట్ట కురుపు క్రిమిన్'ను తొలగించినట్లు తీసి వెయ్యాలి. కాని అంతటితోనే అంతా అయి పోలేదు. ఎందు కంటె, భారతదేశం, తన ధర్మాన్ని, ఆధ్యాత్మిక ప్రజాస్వామ్యానికి వాస్తవార్థాన్ని ఆచరణలో పెట్టడం నేర్చుకోవాలి. ఆ తరవాత దానిని ప్రపంచానికి అందించాలి.

భారత దేశాన్ని గురించి, ఆసియాను గురించి, ప్రపంచాన్ని గురించి, శ్రీ అరవిందుడు సాగించిన ఆలోచనలు అటువంటివి. ఈ మధ్యలో, భారతదేశంలో, రాజకీయంగా, చికాకు కలిగించే ప్రవృత్తులు కనిపించాయి: ఒక ప్రక్క తీవ్ర దమనకాండ, మరొక ప్రక్క భయోత్పాతం గలిగించే ఉగ్రవాద చర్యలు, మనిక్కోట్లా తోటల్లో ఆయన సోదరుడు వరీంద్రుని నాయకత్వంలో ఒక విప్లవ సంఘం పని చేస్తోంది. అనేక చోట్ల ఇంకా అనేక వర్గాలు పని చేస్తున్నాయి. 30 ఏప్రిల్, 1908 న ముజఫర్‌పూర్‌లో డి. హెచ్. కింగ్స్‌ఫర్డ్ అనే ఆయన మీద హత్యా ప్రయత్నం జరిగింది. దేశభక్తి నేరానికి ఈయన ఎందరినో విచారించాడు. వారందరికి కఠిన (బార్బరిక్) శిక్షలను వేసి చెడుకీర్తి పొందాడు. అతని మీద విసరిన బాంబు వాస్తవానికి ఇద్దరి స్త్రీలను పొట్ట బెట్టుకొంది. అనుకొన్న రీతిలోనే ఈ హత్యా ప్రయత్నం మరొక మాతన దమన కాండకు కట్లు తెంచింది. అరెస్టయిన వారిలో శ్రీ అరవిందులూ ఉన్నారు. ఆయనకు ఆలీపూర్ జైలులో ఏకాంతవాస శిక్ష విధించారు. ఈ "కుట్ర" పై విచారణ నెలల తరబడి ఎంతో భారంగా నడిచింది. శ్రీ అరవిందుల తరపున చిత్తరంజన్‌దాస్ వాదించాడు. కారాగారంలో ఒక యేడాది పాటు గడిపిన అనంతరం ఆయనను నిర్దోషిగా ప్రకటించి, మే, 1909 లో, విడుదల చేశారు.

తరవాత శ్రీ అరవిందుడు ఈ కారాగారవాసాన్ని "ఆశ్రమవాసం" గా అభివర్ణించాడు. ఎందుకంటె ఆయనకు అక్కడే, — ఏకాంతం, యాతన, సందిగ్ధత, అసౌకర్యాలతో గూడిన పరిస్థితులలో, తన లాగే న్యాయ విచారణ కోసం వేచి ఉన్న తోటి ఖైదీలతో, దుబారీలతో, అనాథలతో, నేరస్థులతో, అనుమానం, భయం, ఆశ, మోసం, పగలతో గూడిన వాతావరణంలో — సర్వాంతర్యామి అయిన భగవంతుని సాక్షాత్కారానందం లభించింది. నిజంగా ఇది బరోడా 'నిర్వాణానుభవం' కంటె భిన్నమైంది. ఈ అనుభవాన్ని తరవాత ఉత్తరపారాలో 30 మే, 1909 న సింహావలోకనం చేస్తూ :

"నన్ను మనుష్యుల నుంచి వేరు చేసిన ఆ కారాగారం వంక చూశాను. ఇక ఏమాత్రం నన్ను బంధించినవి దాని ఎత్తయిన గోడలు కావు. లేదు, నా వాసుదేవుడే నన్ను ఆవరించి వేశాడు. నా గది ముంగిట ఉన్న చెట్టు కొమ్మల క్రిందుగా నడిచాను. కాని అది చెట్టు కాదు, వాసుదేవుడని నాకు తెలుసు. నేను చూచింది ఎవరినో కాదు, అక్కడ నిలబడి తన నీడను నాకు పట్టుతున్న శ్రీకృష్ణ భగవానుని. నా గది కటకటాల వంక, ద్వార బాధ్యతలను నిర్వహిస్తున్న లోహ జాలం (ఇనుప జల్లెడ), వంక చూశాను. కాని నేను అక్కడచూసిందీ వాసుదేవునే... నేను కారాగారంలోని ఖైదీల, మోసగాళ్ళ, దొంగల, హంతకుల వంక చూశాను. వారిని చూస్తున్నప్పుడూ నాకు వాసుదేవుడే కనిపించాడు. ఈ అంధకారమయ ఆత్మలలో అపవ్యయిత శరీరాలలో నేను చూచింది నారాయణునే..."

జడపదార్థంలో, సర్వ జీవులలో, మానవాళిలో, రకరకాల మానవులలో, ప్రతిదానిలో — సర్వత్ర, — సర్వవేళల శ్రీ అరవిందుడు అంతర్యామి భగవానుని లేదా అభివ్యక్త వాసుదేవునే దర్శించాడు. ఇది బరోడాలో లాంటి శూన్యపు ఐక్యత లేక నిశ్శబ్దతలోని శాంతి కాదు; సర్వాంతర్యామి భగవానుని సాయుజ్యం. అస్తిత్వము (Existence)

యొక్క విశ్వోల్లాసానందం. సర్వగత సత్యాన్ని ఒక చాపమనుకొంటే, ఈ రెండూ ఆ ఏకైక చాపానికి ఒకటి ముఖం, ఒకటి పృష్ఠం.

ఇంక, ఆలీపూర్ కారాగారంలో ఉన్నప్పుడే, శ్రీ అరవిందుడు, మన మనశ్చేతనను అన్నిటి కంటె పరమమైన సత్యచేతనతో కలిపే విధంగా, చేతనంలో ఒక దశ నుంచి పై దశకు, ఆ పై దశనుంచి అంతకంటె పై దశకు ఆరోహించే కీలకాన్ని కనుగొన్నారు. ఈ మర్మాన్ని ఆయన శ్రీ వివేకానందుని తత్త్వం నుంచి గ్రహించాననుకొన్నాడు. ఈ విధంగా శ్రీ అరవిందుడు జైలు నుంచి బయటికి వచ్చిన తరువాత, ఈ ఇహ ప్రపంచాన్ని అంతకు ముందు చూచినట్లు చూడలేక పోయాడు. అంతకుముందరి భారత దర్శనం — సమైక్య స్వేచ్ఛాయుత, స్వశక్త్యాధారిత భవితవ్యానికి ఆత్మ విశ్వాసంతో సమాయత్తమైన భారత దర్శనం — వాడిపోలేదు; అదిప్పుడు మరింత విశాలమైన విశ్వ దర్శనంలో అంతర్భాగమై పోయింది. ఈ మహా విశాల విశ్వదర్శనంలో ఆసియా అంతా, అంతేగాదు ఈ మహా క్షితిమండలమే అంతర్భాగం అయింది. అంతకంటె గూడ మానవునికి, విశ్వమునకు సంబంధించిన భవితవ్యం మొత్తం అందులో చోటు చేసుకొంది. యథాన్యాయంగా పేరుమోసిన ఉత్తరపారా ఉపన్యాసాన్ని జైలు నుంచి విడుదలైన నెల లోపలనే చేశాడు. శ్రీ అరవిందు లీ ఉపన్యాసంలో తాను పొందిన సర్వాంతర్యామి దివ్యానుభవాన్ని వందుకొన్నాడు (మనం చూచినట్లు). ఇదే ఉపన్యాసంలో మొట్ట మొదటి సారిగ, ఆ అనుభవం నుంచి పొరలి వస్తున్నట్లుగా, సనాతన ధర్మం లేదా నిత్య ధర్మం (Eternal religion) అంటే తానే మనుకొంటున్నది ప్రపంచానికి తెలియ జేశాడు. అంతకు ముందు పదిహేను మాసాల క్రితం బొంబాయిలో మాట్లాడిన జాతీయ ధర్మం (Religion of nationalism) కంటె ఇది విస్తృతమైంది. ఈ నిత్య ధర్మ సూత్రాలను ఉపదేశిస్తూ శ్రీ అరవిందుడు :

"మనం సనాతన మని, నిత్య మని చెప్పే ఆ ధర్మం ఏమిటి? . . మనం హిందూ ధర్మమని పిలిచేదే నిజంగా సనాతన ధర్మం. ఎందు కంటె, అది ఇతరా లన్నింటిని పరివేష్టించే విశ్వ మతం. ఒక ధర్మం సార్వత్రికం కాకపోతే, అది సనాతనం కాలేదు. ఒక సంకుచిత మతం,

ఒక శాఖాగత మతం, ఒక వ్యాపారాత్మక మతం పరిమితకాలం మాత్రమే నిలుస్తాయి. పరిమిత లక్ష్యానికి మాత్రమే కట్టుబడి ఉంటాయి .. నేనిక మే మాత్రం జాతీయ వాదాన్ని ఒక ధర్మమని, మత మని, విశ్వాసమని చెప్పను మనకు మాత్రం ఆ సనాతన ధర్మమే జాతీయ వాద మని చెబుతాను."

అంతకు ముందు చెప్పిన మాటలు పూర్తిగ వట్టి పోలేదు. ఆ మాటలు పెరిగి పెద్దవై, సు సంపన్నాలై సార్వత్రికతను, క్రియా శక్తిని, నిత్య నూతనతను, శాశ్వతత్వాన్ని సంతరించుకొన్నాయి. ఈ మారిన దృక్పథానికి లక్షణమేమో అన్నట్లు, 'వందేమాతరా'న్ని పునరుద్ధరించ కుండ, తన కిష్టపడిన 'బెంగాలీ' సంపాదకత్వాన్ని చేపట్ట కుండ, ఉత్తరపారా ఉపన్యాసం చేసిన ఇరవై రోజులలోపలే 'కర్మ యోగి' అనే ఆంగ్ల పత్రికను, దీనికి ప్రతీక అన దగిన 'ధర్మ' అనే బెంగాలీ పత్రికను ప్రారంభించాలను కొన్నాడు. జాతీయ సమస్యలు చర్చకు వస్తూనే ఉన్నాయి. మారిపోయిన ఆయన కూడ నూతన దృక్పథాన్ని చూడక పోలేదు. విశాల ఆసియా, ప్రపంచాల నుంచి వచ్చే నేపథ్య ఒత్తిడులకు స్పందించక పోలేదు. వీటి అన్నింటిని మించి, భవిష్యత్తులోకి సాహసోపేతంగా కదం త్రొక్కుతూ పోవడానికి వీలుగ సమైక్యతావసరాన్ని పునరుద్ఘాటించాడు. ఒక విషయం చెప్పాలంటే, 'కర్మయోగి' ప్రథమ సంచికలోనే శ్రీ అరవిందుడు భారత దేశంలో మహమ్మదీయుల స్థానాన్ని గురించి నిర్ద్వంద్వంగా అద్వితీయంగా ఇలా చెప్పాడు .

" కాంగ్రెస్ ప్రశంసలతో గాని, రాజకీయ సర్దుబాటులద్వారా గాని, హిందూ–ముస్లిమ్ సమైక్యత సాధింపబడదు. దానిని కూకటివేళ్ళదగ్గర సాధించాలి. ఎందుకంటె అనైక్యతకు కారణా లెక్కడ ఉన్నాయో అక్కడ వాటికి మందు వేయాలి. మన విభేదాలకు కారణం అపార్థం చేసుకోవడ మని, ప్రేమ ప్రేమను జనింపచేస్తుందని, బలం బలవంతుని శాంతిపరుస్తుందని, ఈ సమస్యను పరిష్కరించే టప్పుడు గుర్తుంచుకొంటే మంచిది. పరస్పరావగాహన, అనుకంపలతో అపార్థ కారణాలను తొలగించడానికి మనం ప్రయత్నించాలి. ముసల్మాన్‌లో గూడ నారాయణు డున్నాడని, అతనికిగూడ మన జనని తన హృదయంలో స్థాన మిస్తుందనే విషయాల్ని ఎప్పుడూ గుర్తు పెట్టుకొని,

దేశభక్తులుగ మనం అకలంక ప్రేమను ముసల్మాన్ సోదరునికి అందించాలి అ తనిని మనం కృత్రిమంగా కలవరాదు. మన స్వార్థం, బలహీనత, భీరుతల కప్పిపెట్టు కోనడం కోసం అతనిని పొగడరాదు.. ఇస్లామ్ మతాన్ని, ముసల్మానుని మన పాఠకులకు క్రొత్త వెలుగులో చూపించడం, మహమ్మదీయ చరిత్ర నాగరికతలకు సంబంధించి నుంచి విషయాలను వ్యాప్తి చేయడం, జాతీయాభివృద్ధిలో ముసల్మాన్‌కు సముచిత స్థానాన్ని ఇవ్వడం, మన జీవన విధానాలతో అతని సమాజ జీవితాన్ని సమైక్యం గావించే విషయాలకు ప్రాముఖ్యత నివ్వడం — వీటికి మన ప్రణాళికలో ముఖ్య స్థానాన్ని ఇద్దాము..."

ఇంకొకటి, శ్రీ అరవిందుడు, మొదటి సంచికలోనే, భారతదేశ సమస్యను విస్తృత మానవాళి సమస్యగా లేదా ప్రపంచ సమస్యగా చూపించడానికి జాగ్రత వహించాడు :

> "స్వేచ్ఛా చింతన, భౌతిక వాద అవశ్య అరాజకత్వాల నుంచి ప్రపంచం, ఒక నూతన ధర్మ సంశ్లేషణం వైపు, అనుభవం వైపు, అసహనం లేని ఒక నూతన మతైక విశ్వజీవనం వైపు పయనిస్తోంది. ఈ విశ్వజీవనంలో విశ్వాసం ఉత్సాహం ఉన్నాయి. ఇది అన్నిమతాలను అంగీకరిస్తుంది, ఎందుకంటె దీనికి ఆ 'ఏకత' పై అచంచల విశ్వాసం ఉంది. విజ్ఞానం, విశ్వాసాలను, ఆస్తిక్యతను, క్రైస్తవాన్ని, ఇస్లామ్‌ను, బౌద్ధాన్ని ఆ విశ్వమతం పరివేష్టిస్తుంది. కాని అది వీటిలో ఏ ఒక్కటీ కాదు అటువంటి ధర్మ సంశ్లేషణం వైపు విశ్వాత్మ గమిస్తుంది ... అందువలన, మన లక్ష్యం మానవాళి కోసం భారత నిర్మాణానికి తోడ్పడడం "

భారతీయునికి, ప్రత్యేకంగా భారత యువతకు, "భారతదేశ కార్యం, ప్రపంచ కార్యం, దైవకార్యం," అన్నీ ఒకటేనని, మొదటి దానిని సాగిస్తే అది మిగతా వాటికి దారి

తీస్తుందనీ, తరవాతది లేకుండ అంతకు ముందరిది పూర్ణ ఫలితాల నివ్వలేదనీ ఆయన భావించినట్లు కనిపిస్తున్నది. నిన్ను నీవు తెలుసుకో (ఆత్మానం విద్ధి), నిన్ను నీవు పరిపూర్ణం కావించుకో :

> "మీలో ఉన్న సర్వశక్తికి ఏది ఆధారమో దానిని తిరిగి పొందండి. అప్పుడు తతిమ్మాదంత — సామాజిక భద్రత, మేధాసంపత్తి, రాజకీయ స్వేచ్ఛ, మానవాలోచనా విధానంపై అధికారం, ప్రపంచాధిపత్యం — మీకు సమకూరుతుంది."

ఆయన పూర్వం అంటే ఆలీపూర్‌కు ముందు చెప్పినదానికి ఇప్పుడు చెప్పినదానికి ఏమాత్రం వైరుధ్యం లేదు. కొన్ని ద్వారాలు బార్లగా తెరవబడ్డాయి. సుదూర శ్రేణులు, సమీప దృశ్యాలు పరస్పరం సంలీనం కానించ బడ్డాయి. భారత భవితవ్యం మానవ జాతి అదృష్టంతో ముడి వేయబడింది.

నిర్దోషిగా జైలు నుంచి విడుదల అయిన తరవాత, కొన్ని నెలలలో, ప్రభుత్వం అనుసరించిన "సంస్కరణం — దమనా"లు అనే ద్వంద్వ ధారా (Double edged) విధానం, జాతీయోద్యమాన్ని కొంత కాలం పాటైన నిలువరించడంలో, ఎలా కృతకృత్యమైందీ స్వయంగా గమనించే అవకాశం శ్రీ అరవిందులకు లభించింది మితవాద తత్త్వం అలంకారికంగా చెప్పాలంటే అమ్ముడు పోవడానికి ఒప్పుకొనే తత్వం ఒక ప్రక్క, భయోత్పాత నిదానం అంటే నిర్దయాత్మక దమన కాంక్షను ఆహ్వానించేది మరొక ప్రక్క, తను తమ దారులు తప్పకుండ ప్రభుత్వానికి ప్రయోజనాన్ని చేకూర్చునట్లే ప్రవర్తించాయి. ప్రతి ఒక్కరి లోను, ప్రతి వస్తువులోను అంతర్గతంగా భగవంతుడున్నాడనే విషయానికి సంబంధించి ఆలీపూర్‌లో ఆయనకు గలిగిన సాక్షాత్కారం సత్యానికి ఒక పక్షం మాత్రమే. మానసిక యంత్రాంగంలోనే కాక 'అహం' గరగరలతో, భంగురతలతో, మూర్ఖతలతో భగవంతుని మరుగు పరచడం రెండవ పక్షం. మనుషుల్లో అతి మంచివాళ్ళు గూడ మానసికమైన ఉచ్చులలో, మతిభ్రమలలో పడిపోతున్నట్లు కనిపిస్తున్నది. అందు వలన మానవ స్వభావం పైపైన గాక సమూలంగా మారవలసి ఉంది. అతని

ప్రస్తుత లొసుగులకు చిహ్నాలైన వాటిని ప్రక్కన పెట్టి, పరమ చైతన్యానికి మార్గ మేర్పరచు కోవాలి. పదార్థం, జీవం, మనస్సు — మనస్సు పైస్థితికి గూడ, ఆలీపూర్‌లో ప్రభవించిన "చైతన్యారోహణం" (Ascent of consciousness) లాంటి ఆరోహణం ఎందుకు సంభవించరాదు?

ఆయన లోలోపలి ఆలోచనలు ఇలా ఉంటే, బాహ్య ప్రపంచానికి ఆయన ఇంకా దేశభక్తి మీద కవిత్వం చెప్పే కవిగా, జాతికి గురువుగా, నేషనలిస్టు పార్టీ అంతరాత్మ పరిరక్షకుడుగానే కనిపిస్తున్నాడు. కాని ప్రభుత్వం మాత్రం, పూర్వం కంటె గూడ, ఇప్పుడు ఆయనను ప్రధమ శత్రువుగా పరిగణించింది. ప్రభుత్వంలోని యుక్తిపరులు కొందరు "ఆయనను శాశ్వతంగా నోరు మూయించాలంటే ఏమి చెయ్యాలి? నేరంమోపి జైలులో పెట్టడమా? లేక దేశాన్నుంచి బహిష్కరించడమా," అని ఆలోచనలో మునిగిపోయారు. ఇటువంటి పరిస్థితులలో, 1910 ఫిబ్రవరి మధ్య కాలంలో, "చంద్రనాగూరు వెళ్ళు" అనే ఒక విప్లవ ఆదేశం అంతర్వాణి ప్రబోధంగా ఆయనకు వినిపించింది. ఆ ఆదేశాన్ని ఆయన పాటించాడు. మరు రోజు తెల్లవారే సరికి అక్కడకు చేరుకొన్నాడు. ఏకాంతంలోకి వెళ్ళి ధ్యాన నిమగ్ను డయ్యాడు. "రాజకీయాలను పరిత్యజించి, సాక్షాత్కారం అంతు చూడాల"నే నిర్ణయాన్ని ఆయన ఆచరిస్తున్న సాధన బలపరిచింది. రహస్యంగా 4 ఏప్రిల్. 1910 న స్టీమరు మీద పుదుచ్చేరి చేరి జీవితాంతం "తపో గుహలో" వలె అక్కడే ఉండి పోయాడు.

1905 లో, తన భార్య మృణాళినికి వ్రాసిన లేఖలోని "ఉన్మాద త్రయం" నుంచి 1947 ఆగస్టు 15 ఉపన్యాసంలో ఆయన సూచించ మన్న "స్వప్న పంచకం" వరకు జరిగిన పరిణామం, పైపై తేడాలను పట్టించుకోకపోతే, చాలసాఫీగా, నిరంతరాయంగా జరిగిందనే చెప్పాలి. ఎలాగంటే, నాటి ఉన్మాదమే పరిణమించి స్పష్టమైంది ప్రణయత్రయం (భారత దేశాన్ని ప్రేమించడం, భారతీయులను ప్రేమించడం, దేవుని ప్రేమించడం). ఆశంసనత్రయం (దాసతనం నుంచి దేశాన్ని విడిపించడం, తమస్సు నుంచి భారతీయులను మేల్కొలపడం, భగవంతుని దర్శించి ఆ అనుభవాన్ని పొందడం,) ఉద్యమత్రయం (రాజకీయం, మత ప్రబోధం, యోగం) — ఈ త్రిత్రయం

కాలం నిండే కొలది, తమ ప్రాబల్యాన్ని ఎంతో విస్తరింప చేసుకున్నాయి. వాటి అవగాహన ఎంతో దూరం సాగింది. విస్తరించి విస్తరించి, సాగి సాగి, మొత్తం ఆసియాను ప్రపంచాన్నే గాక, భావి మానవుని దృక్పథాన్ని, జీవనాన్ని దివ్య జీవనంగా మార్చే యోగాన్ని గూడ తమ కౌగిట్లోకి తెచ్చుకొన్నాయి.

పుదుచ్చేరిలో, యోగసాధన తీవ్రంగా చేస్తున్న మొదటి రోజులలో, మనస్సు నుంచి అతిమనస్సుకు జరిగే పరిణామాత్మక గతిని, అతి స్పష్టంగా, నిశ్చితంగా శ్రీ అరవిందులు దర్శించారు. ఆయన స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంలో ఇచ్చిన సందేశంలో, ఈ "గతి"ని ఒక 'పరిణామ దశ' అని అన్నారు. ఈ దశ మనిషిని ఉన్నత విస్తృత చేతనకు తీసుకు వెళ్తుందన్నారు. తాను, వ్యక్తి (మనిషి) పరిపూర్ణత సమాజ పరిపూర్ణతను గురించి ఆలోచించి కలలు గనడం ప్రారంభించిన నాటి నుంచి నేటి వరకు వేధించిన సమస్యలను ఇది పరిష్కరిస్తుందని చెప్పారు. ఏమైనా ఇది కేవలం ఊహాగానం కాదు. ఎందు కంటె, ఈ భూమిలో, పదార్థము, అచేతనలో కూడ (Inconscient), మునిగివున్న దైవదర్శనంనుంచి లేదా దాని అనుభవంనుంచి, దాని ప్రత్యక్ష జ్ఞానం నుంచి ఆ ఊహ, ఆ జోస్యం మోసులెత్తింది. ఈ ప్రపంచంలో దైవనిమజ్జనం జరిగింది కనుక, దేవుడు మనిషిలో, ప్రపంచంలో — వైయక్తిక, సామాజిక, సామూహిక, భౌమిక జీవితాలలో — అంతిమంగా పుష్పించవలసిన ఆవశ్యకత ఉంది. అది సంభవం కూడ. తాత్కాలిక మూర్ఖత్వం నుంచి మేల్కొన్న, అవిద్య నుంచి ప్రక్షాళితమైన, అహంకారం నుంచి విముక్తమైన, జ్ఞానాభిషేకంతో పునరుజ్జీవితమైన, అతిమానసిక యోగంతో పరివర్తితమైన — ఒక్క మాటలో చెప్పాలంటే భూమి మీద ఉండగానే దివ్యత్వం పొందిన — మానవుని, సమాజాన్ని, ప్రపంచ మానవాళినే ఆ దర్శనంలో ఆయన చూచాడు.

ఆ తరవాత 29 మార్చి, 1914లో పరిణతి చెందిన ఫ్రెంచి ఆధ్యాత్మిక తత్వాభిజ్ఞురాలు మీరా రిచర్డ్ (ఇప్పుడామె నందరు మాత అంటారు) శ్రీ అరవిందుని కలిసింది. సాక్షాత్కారానుభవాలలో, వాటి మేరలలో, గుణంలో, భవిష్యత్తును గురించిన ఆశంసనలలో తామిద్దరి మధ్య అద్భుతమైన సాదృశ్యం ఉందని వారు

గమనించారు. అప్పుడు వారు 'ఆర్య' అనే మాసపత్రికను ప్రారంభించాలనే నిర్ణయానికి వచ్చారు. ఆ పత్రిక 15 ఆగష్టు, 1914 నుంచి జనవరి 1921 వరకు నెల నెలా వచ్చింది. ఈ పత్రికలోనే శ్రీ అరవిందులు భవిష్యత్తుకు సంబంధించిన సమగ్ర దర్శనాన్ని, తమ 'అపార ప్రజ్ఞా పారమితి'తో, అద్భుత స్వాధావికమైన ఓజస్వి శైలిలో వ్రాశారు. 'దివ్య జీవనం' (The life divine), "యోగ సమన్వయం" (The synthesis of yoga) గ్రంథాలు ప్రస్తుత మానసిక మానవు (Mental man) డిని భవిష్య అతిమానసుని (Future supramental being) గా పరివర్తింప జేయడంలోని సైద్ధాంతిక, ఆచరణాత్మక సమస్యలను చర్చించగా, "మానవావృత్తి" (Human cycle), మానవుని ఐక్యతాదర్శం" (The ideal of human unity) అనే ఆయన గ్రంథాలు భావి సమాజ పరిణామ సమస్యను, భావి మానవ సమష్టి కుటుంబాన్ని తడిమి చూశాయి. ఆయన గ్రంథాల మధ్య ఈ భేదాలను చూపడం మనం అర్థం చేసుకోవడం కోసమే గాని, ఆ భేదాలు కేవలాలని కాదు. ఎందుకంటే, అంతా కూడ, బీజరూపంలో, దివ్యజీవనంలోనే ఉంది. "దివ్య జీవన"మే ఇతర రచనలకు మూలం.

ఆయన చివరి సంవత్సరాల పరిణత కవితా సంహిత అయిన "సావిత్రి"లో శ్రీ అరవిందులు తమ గద్య రచనలలోని అంతర్దృష్టిని, వెలుగును, భవిష్యద్దర్శనాన్ని, పథకాలను, విశ్వాత్మ జరిపే సాంగ్రామిక, ప్రతీకాత్మక నాటకంలోకి అనువదించారు. విశ్వాత్మ జరిపే సంగ్రామానికి ప్రతీక సత్యవాన్ మెరుగులాంటి. ఈ యుద్ధం ఇప్పటికీ అతి సంకట స్థితిలో జరుగుతూనే ఉంది. దీని పర్యవసానం కావ్యంలో సూచిత మైనప్పటికీ, అదింకా సాధించవలసి ఉంది — బహుశ అనతి కాలంలోనే.

తమ భావి యోగవర్తన ప్రశాంత ప్రభాతంలో, శ్రీ అరవిందులు పుదుచ్చేరిలో ప్రథమ సంవత్సరాల తరవాత, సాయుధ విప్లవంతో పని లేకుండానే భారతదేశం స్వాతంత్ర్యం పొందుతుందని భారత రాజకీయాలకు తమ క్రియాశీలక పాత్ర అనవసరిత చేసి చూడగలిగారు. ఆ కారణాన, ఆయన తమ కాలాన్ని 'ఆర్య'కు అతి

మానసిక యోగానికి వినియోగించా లనుకొన్నాడు. ఆయన చుట్టూ ఏర్చి కూర్చినట్లు కొంత మంది మంచి వ్యక్తులు చేరారు. 1920 లో మాత మీరా కూడా చేరింది. ఇప్పుడు ఆశ్రమం ఆరంభమైంది. 24 నవంబరు, 1926 న ఆయన ఏకాంతంలోకి వెళ్ళాలని నిర్ణయించుకొన్న తరవాత మాత సారథ్యంలో ఆశ్రమం బాగా విస్తరిల్లింది. శ్రీ అరవిందులు, తమ ఏకాంత సాధనలో ఏ రకమైన 'కృషి' (work) లో నిమగ్ను లయ్యారనే దానిపై ఆయన ఉత్తరాలలో కొన్ని సూచనలు కనిపిస్తాయి

13 జూలై, 1920న తన అంతేవాసులలో ఒకరైన చంద్రశేఖరానికి శ్రీ అరవిందులు ఇలా వ్రాశాడు : "నేను విజ్ఞానాన్ని (అతి మనస్సును, పైదశకు పెంచుకొంటూ పోతున్నాను. ఇతర వస్తువులను ఆ అతి మనస్సులోకి మారుస్తున్నాను." అంటే మానసిక, ప్రాణిక, భౌతిక అధోశక్తులను అతిమానసికీకరించడానికి, వాటిని అధివసించడానికి, వాటిని పరివర్తించడానికి, మార్చడానికి, అతిమనస్సును క్రిందికి తీసుకు వస్తూ అతిమానసికీకరణ వ్యాపారంలో నిమగ్ను డయ్యాడు. తిరిగి రాజకీయాలలో ప్రవేశించి బెంగాలీ కాంగ్రెస్ నాయకత్వాన్ని స్వీకరించవలసిందని శ్రీ అరవిందులకు సి. ఆర్. దాస్ 1922 లో వ్రాసినప్పుడు, ఆ ఆహ్వానాన్ని మన్నించలేనని వ్రాస్తూ .

"మానవుడు తనను తాను మహోన్నత మానస భూమికపై నిలుపుకొంటేనే తప్ప, మానవజాతి పరిభ్రమించిన నిరర్థక చక్రం నుంచి ఎప్పటికీ అతడు విముక్తం కాలేడని నాకు మరింతగా స్పష్టమవుతోంది. నాలో, లోగడ, ఎప్పటి నుంచో ఉన్న ఒక భావన మీద నాకు నమ్మకం చిక్కింది. కర్మకు, జీవితానికి నిజమైన భూమిక ఆధ్యాత్మికత; అంటే యోగం ద్వారా నవచైతన్యాన్ని సంపాదించాలి. కాని ఈ మహా చైతన్యం యొక్క గతిశీలక స్వభావం వాస్తవంగా ఏమిటి ? దాని నిష్పాదక సత్యం యొక్క నియమ నిబంధనలు ఏమిటి? దానిని క్రిందకు దించుకు రావడం ఎలా ? కదిలించడం ఎలా ? ఘటియించ

చేయడం ఎలా? జీవితం మీదికి దానిని తిప్పడం ఎలా? ఇప్పుడు మనకు ఉన్న పరికరాలను—ప్రజ్ఞ, మనస్సు, ప్రాణం, శరీరాలను—ఈ మహా పరివర్తనకు నిజమైన సంపూర్ణపథాలుగ తయారుచేయడంఎలా? ఈ సమస్యను స్వానుభవం ద్వారా పరిష్కరింప ప్రయత్నిస్తున్నాను. ఇప్పుడు నాకు విశ్వసనీయమైన ఒక భూమిక, విస్తృత పరిజ్ఞానం, ఆ రహస్యం మీద కొంతవరకు అధికారం ఉన్నాయి."

మరొక అంతేవాసికి ప్రవృత్తః మిత్రా శ్రీ అరవిందులు పదమూడు సంవత్సరాల తరువాత :

"పృథివీ చైతన్యంలోకి నేను ఏదో ఒక అంతర్గతసత్యాన్ని — ప్రభాసను, సామరస్యాన్ని, కాంతిని — తీసుకు రావాలని చూస్తున్నాను. నేను దానిని పైన చూస్తూనే ఉన్నాను, అదేమిటో నాకు తెలుసు. — అది నా చైతన్యం మీదికి పైమంచి మెరుపును ప్రసరిస్తున్నది. మానవ ప్రకృతి ఇలాగే సగం వెలుగు సగం చీకటిలో కొనసాగడానికి బదులు, మొత్తం మానవ సంసారాన్ని, ఆ అంతర్గత సూత్రం, తన సహజ శక్తిలో ఇముడ్చుకోవడానికి అవకాశాన్ని వెతుకుతున్నాను. దివ్యచేతన వికాస మార్గాన్ని తెరిచే ఈ "సత్యా"వతరణాన్ని పృథివీ పరిణామ అంతిమార్థంగా (అంతిమదశగా) నేను భావిస్తున్నాను."

దీని నంతటిని చూస్తే, శ్రీ అరవిందుల భావిదర్శనం, పాక్షికాలైన ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక, ధార్మిక, దేశీయ, జాతీయ దృక్పథాలను అధిగమించిందనుకోవచ్చు. భారత, ఆసియా భవితవ్యం గురించే కాక, సర్వ మానవ భవితవ్యం గురించి ఆయన ఆలోచిస్తున్నాడు; దివ్యజీవనాన్ని ఆచరించే లేదా భగవంతుని

అభివ్యక్తం చేసే అతిమానసీకృత మానవాళి గురించి, పరివర్తిత మానవ జాతి గురించి ఆలోచిస్తున్నారన్నమాట.

మానవ జాతి, తన సుదీర్ఘ చరిత్రలో కొన్ని చీకటి వెలుగులున్నా, రాజకీయ, ఆర్థిక, సామాజిక, ఇంక ఇతర విప్లవాల నెన్నింటినో చూచింది. ఇవన్నీ గూడ విషయాలను పైపైనే స్పృశించాయి. అహం కు వేర్పాటు గుణం ఉంది. మానవుడు దీనిని అంటిపెట్టుకొని వేళ్ళాడతాడు. ఇది మొదటి లటంకం. ఈ విప్లవాలన్నీ గూడ ఈ అటంకాన్ని తొలగించలేక పోయాయి. ఫలితంగా దాని నంటిపెట్టుకొని ఉన్న స్వార్థం, పేరాస, అసూయ, ద్వేషం, హింస, దుర్వృత్తులకు వైయక్తిక, సామూహిక రంగాలలో స్వేచ్ఛ లభించింది. ముందు మనకు ఆధ్యాత్మిక విప్లవం రావాలి. ఆధ్యాత్మిక విప్లవ మంటే అహంలో జీవించడం కాదు; విశ్వవ్యాప్త ఆత్మలో జీవించడం. తరవాత అతిమానస విప్లవం రావాలి. అతిమానస విప్లవం అంటే సత్యచేతన మనస్సును తొలగించి దాని స్థానాన్ని ఆక్రమించడం. ఈ అతిమానసశక్తి భౌతిక దశతో సహా అన్ని దశలలోను పని చెయ్యాలి. ఇదిగో, ఈ సమగ్రప్రక్రియ, ఈ పృథివీ మండలంపై మానవుని అతిజీవితాన్ని (Survival) 'నిశ్చితం' చేయడమే గాక, సాక్షాత్తు పృథివీ జీవితాన్నంతటిని దివ్యం చేయడానికి కావలసిన పరిస్థితులను సృజించగలదని శ్రీ అరవిందులకు నమ్మకంగా తోచింది. పరిణామ క్రమంలో, ఈ 'అనంతరదశ' సిద్ధవిషయం కావడానికి లక్షల కోట్ల సంవత్సరాలు పడుతుందని భావించాలిసిన పని లేదు. పరిణామ గతి, తనతో పాటు ఒక త్వరణ మూలకాన్ని (అంటే క్షణ క్షణం వేగం పెంచే అంశాన్ని), ఆకస్మికంగా ఇంకా ఇంకా వేగంగా పరిణమించడాన్ని వహిస్తుంది. "దివ్య జీవనం" గ్రంథంలో "అతిమానసం వైపు ఆరోహణ" అనే ప్రకరణంలో శ్రీ అరవిందులు స్పష్టం చేశారు :

"ప్రకాశరహిత భౌతిక పదార్థంలో 'పరిణామశక్తి' నడక బహు మందకొడిగా ఉంటుంది. యుగాని కొక అడుగు వేస్తుంది. పోతే

జీవన ప్రక్రియ యొక్క పరిణామగతి నెమ్మదిగానే సాగినా భౌతిక పరిణామగతి కంటె వేగంగా అడుగులు వేస్తుంది. అక్కడ యుగం పడితే, ఇక్కడ సహస్రాబ్ది పడుతుంది. మనస్సు రంగప్రవేశం చేసి కాలం యొక్క ఈ నత్త నడకను త్వరితంచేసి, శతాబ్దికే ఒక అడుగు వేయిస్తుంది. కాని చివరకు చేతనాత్మ ముగ్గులోకి దిగినప్పుడు ఈ పరిణామం తీవ్రగతిని సాగిపోవ సాధ్యమవుతుంది."

పరిణామం పంచవర్ష పథకాల శ్రేణి కాదు. ప్రతి పది సంవత్సరాలకు శాస్త్రవిజ్ఞానం రెట్టింపవుతుందని చెప్పినట్లే, ఈమధ్య, పరిణామంలో గూడ "దారుణ అత్యావశ్యకత" (Terrific urgency) ను ప్రవేశపెట్టారు. మనం మారతాము, సకాలంలో మారతామా మారరాము, లేదా నశిస్తాము. ఈ మార్గం ఎంత సరళమైందో అంత అశుభకరమైంది. కాని శ్రీ అరవిందులు ఆధ్యాత్మిక, అతిమానసిక విప్లవాలు సంభవమే నని, వాటిని నిర్దుష్టంగా నడపాలని గట్టిగ విశ్వసించాడు. ఈ నిర్ణయానికి వచ్చిన తరవాత, మనిషి చివరకు దివ్యచేతనునిగానో, అతిమానవునిగానో మార్చగల సత్వర చైతన్య వికాసాన్ని ప్రారంభించడానికి ఒక ప్రణాళిక వేసుకొన్నాడు. ఈ ప్రణాళికా సంఘంలో సభ్యులు ఆయనొక్కడే. సభ్యుల నియామకం గూడ చేసింది ఆయనే. ఈ ఏక సభ్య సంఘం భవిష్యత్తు కోసం ఏర్పాటైంది. "అహంకార్ హఠావో" అనేది దీని సింహనాదం. అహం మీద గరిష్ఠ పరిమితి విధించాలి. ఆ పరిమితి మిస్స మాత్రమే అనంతత్వానికి, అమృతత్వానికి ఆధ్యాత్మిక సంతానం కావడానికి వీలుందా నిరహంకారులు కండి!

శ్రీ అరవిందుల భావిదర్శనం, భావి మానవ దర్శనం అటువంటిది గనుక, అటువంటి దర్శనంలో సాక్షాత్కారాన్నివ్వగల బీజశక్తి, ప్రచోదనాలు ఉన్నాయి గనుక అది ఆయన యోగానికి, ఆశ్రమవాసులు నిర్వహించే సామూహిక యోగానికి ప్రధానాంశమైంది ఆయన స్థాపించిన ఈ ఆశ్రమాన్ని, 5 డిసెంబరు, 1950 న

ఆయన ఈ దేహాన్ని వదలి పెట్టిన నాటి నుంచి, మాత సారథ్యం వహించి, నూతన సాక్షాత్కార మహావకాశాలను కల్పించింది. శ్రీ అరవిందుల యోగాన్ని, అది వాస్తవంలో ఎలా పని చేస్తుందో అర్థం చేసుకోవడానికి, భవిష్యదర్శక మహాకావ్యం "సావిత్రి" తోడ్పడుతుంది సత్యవాన్ మరణాన్ని ఈ మహా కావ్యం జోస్యం చెప్పినట్లే ముందుగా నిర్ణయమైన ఆసన్న అణు హోమ పరిణతంగా మానవుడు, భూమి నాశన మవుతారని ఒక విశ్వనారదుడు ప్రకటించినట్లుగా ఉంది నరకం అతి జీవనాల మధ్య, మరణం వస్తుజీవనాల మధ్య, పీడకలలాంటి జీవన్మరణాను విముక్త చేస్తూ జీవనాల మధ్య సమస్యను ప్రపంచంలోని ప్రధానమంత్రులు, ప్రధానాధికారులు, అత్యంత సంక్లిష్ట ప్రయోగశాలలు బహిరంగంగా చర్చిస్తుంటే, అనంత రాత్రుల ఉభయ సంధ్యల నిత్య దినాల నిగూఢ ప్రసంగాలలో ఆ సమస్య అస్పష్టంగా చర్చిత మవుతోంది, కాని శ్రీ అరవిందులు మనం అభయ మిస్తున్నారు. ఈ అభయం గూఢ భావదర్శనంలో ఒక భాగమే: భావి కోసం జరిపే సమరాన్ని మృత్యువు గాక ప్రేమ జయిస్తుంది. పృథివీ పరిణామ చరిత్రలోని ప్రస్తుత సంకటస్థితి నుంచి ఒక నూతన మానవుడు ఉదయిస్తాడు, ఒక నూతన ప్రపంచం ఇలా అవతరిస్తుంది; ఒక నూతన స్వర్గం ఒక నూతన పృథివి అంతిమంగా ఇక్కడే — "కాలం యొక్క ఈ తీరం, ఈ సైకతాల పైనే," — స్థాపింపబడతాయి.

సావిత్రినుంచి గ్రహించిన ఈ దిగువ పంక్తులలో, సావిత్రిపై అనంత శక్తి చరమ ఆశీస్సుల నిష్ఫలమే గాదు; శ్రీ అరవిందులు అతి సంకులంగా ఉన్న ఈ కాలంలో మానవాళికి రక్షణగా నిలిచి, వారి శ్రేయస్సు భావించే మహా ఆత్మకు అభయాశీస్సులు ఇచ్చినట్లు గూడ అర్థం చెప్పవచ్చు:

నా కాలాతీత సంకల్పాన్ని పాటించిన గాన
నీ జ్యోతిరాత్మను అభయహస్తముల దీవింతు,
నీ ప్రేమైక హృదయాన్ని ఆశీర్వదింతు,
కౌగిలిలోన నా క్రియాశక్తికి నిన్ను జోడింతు ...

ఓ సావిత్రీ! పృథ్వ్యాత్మను జ్యోతిలోనికి ఉద్ధరించుము
మానవ జీవన మధ్యమున మాధవుని అవతరింప జేయుము:
పృథివి నా కార్యాలయం నా నివాసంబగు
దివ్యబీజ సంస్థాపనకు నా జీవనోద్యానంబగు.

మానవ యుగమున నీ మహాకార్యం ముగిసినప్పుడు,
పృథ్వీమానసము దివ్యజ్యోతిర్నిలయ మగు,
పృథ్వీ జీవనము దివ్య కల్పవృక్షమై వర్ధిల్లు,
పృథ్వీ దేహము దేవుని పూజామందిర మగు.

ఇది తన ఆవాహన శక్తిలో, చరమ నిశ్చితత్త్వంలో నిజంగా శ్రీ అరవిందుల విశ్వదర్శన సారం, భావి పృథ్వీదర్శన సారం.